# వసంతకుమారి



కృతిస్వామి

మదరాసు రాష్ట్ర ప్రధానామాత్యులు

ఆంధ్రకేసరి

శ్రీ శ్రీ శ్రీ టంగుటూరి ప్రకాశము పంతులుగారు



గ్రంధకర్త

కవిశేఖర

జి. జోసఫు

# ANDHRA UNIVERSITY

*From*

C. R. REDDY, Kt.,
Vice-Chancellor.

Collector's Office Road,
MAHARANIPETA P. O.
District- Vizag

D/ 11-5.1946.

## PREFACE.

" Mr. Joseph Kavi is a name to be reckoned with in contemporary Telugu Literature. One of his poems " The Message of Tears " written in exposition of the condition of the untouchables in Hindu Society ranks high both for its power of expression as well as thought and feeling. The present book " Vasanta Kumari " is another of his fine contributions and it deserves wide audience and patronage.

I commend the generosity of Sri Kalluri Umamaheswara Rao Garu, Zamindar, who has borne the cost of the publication of this book and in that way helped a poet, who is as poor as he is deserving."

(Sd.) C. R. REDDY.

---

# ఉపోద్ఘాతము

"Poetry carries truth alive into the heart by passion."

—Wordsworth.

సీ॥ జ్ఞానంబునకు మూలసారమౌ ఆత్మకా
వ్యకవిత్వమని - వర్డ్సువర్తు నుడివె!
సత్యంబునకు సౌఖ్యసంగంబు చేకూర్పఁ
జాలినకళయంచు - జాన్సననియె!
అతులసంగీత రసాత్మకంబైన భా
వాలాపమనుచుఁ గార్లైలు తెలిపె!
ప్రతిభా విలాసంబు వాక్యదేహంబుఁ దా
ల్చిన రూపమనుచు - షెల్లీ వచించె

తే॥ హడ్సనాదిగ నెందఱో యాంగ్లకవులు
పద్యకవితకుఁగల గౌరవప్రశస్తి
యట్టిదిట్టి దనంగరాదని సహస్ర
ముఖముల నుతింప వినమొకో! పూర్వమందు.

"రాణాప్రతాపసింహ చరిత్ర"

సత్కృతులు జాతినీతి మతదేశోద్ధారకములు. అవి మానవుల నన్నివిధముల నలరించి యాత్మవికాసము పెంపొందించి యుద్ధరించును. అందుపద్యకావ్యములు భాషామహాదేవికుదార వజ్రసంఘటిత హాటకభూషణములు, కృతికర్తల నాదరించి గౌరవించి బహుగతుల బహుకృతులు గావించి పూర్వక్షితిపతులు భాషాపోషణమును కవికులపోషణమును గావించి ధన్యత గాంచుచుండిరి.

ప్రస్తుతగ్రంథము "వసంతకుమారి" ఏతద్గ్రంథకర్త చంద్రహాస, సర్ కట్టమంచి, కన్నీటికబురు- భక్తవిజయ- భారవి- హైదరాబాదు నవాబు చరిత్రలో - నగుపద్యకావ్యములు రచించి యాంధ్రదేశమున నపారయశము

నార్జించిన శ్రీ శ్రీ జి. జోసెపుకవి. 1945 డిశంబరు నెలలో హేలాపురమున జరిగిన ద్వితీయవార్షికోత్సవ సభలకు శ్రీరాయలసీమ కళాపరిషత్తు జోసపుకవి నాహ్వానించి సాలువు లొసంగి, సన్మానపత్రము నర్పించి "కవిశేఖర" బిరుదంబుఁ బ్రసాదించి కృతకృత్యతఁ గాంచెను. ఆంగ్లాంధ్ర భాషా నిష్ణాతలు, విమర్శకాగ్రేసరులు శ్రీ శ్రీ డాక్టరు కట్టమంచి. రామలింగారెడ్డి ఎం. ఏ. (కాంటబ్) గారీ కవిరచించిన "కన్నీటికబురు" నకు విపులమైన యుపోద్ఘాతము వ్రాసి యభినందించినారనిన నామాటందల పెట్టనేల!

ఈ "వసంతకుమారి" కావ్యమునంపి జోసపుకవి సత్తముడు పీఠిక వ్రాయుఁడని కోరుట యవ్యాజభక్తి విశ్వాసములతో నన్ను గారవించుటకే కాని, యాయన గ్రంథమున కెక్కుడుగ వన్నెఁజేకూర్పఁగలనను తలంపుతోఁ గాదని నేను భావింతును. దూరపుమండలము నందలి కవిశేఖరుని గ్రంథమున నుపోద్ఘాతము వ్రాయు నవకాశము లభించుటకై నే నానందించుచున్నాను.

గ్రంథమందలి కథావస్తువు మిక్కిలి పరిమితము. ఒకానొకకుగ్రామమునఁ గడకులమున "శంభుఁడు" జననమందెను. వినయ, విధేయతలు దయాదాక్షిణ్యములు గలఁవాడు. పరుల బాధలుచూచి యోర్వనేరని మృదుస్వభావము సంసారస్థితిగతులు సంపన్నములు గావు. లేవయసుననే పెండ్లి చేసికొనెను. "నిమ్మి" నెమ్మిగలకొమ్మ, గుణవతి, దయావతి, అనుకూలవతి ప్రజావతియునయ్యెను. అచిరకాలమున శంభునకుఁ గంచంత కాపురము పెరిగెను. స్వకులజుల సాంఘిక శోచ్య దుస్థితికై వగచి వగచి వాని చిత్తము నొచ్చి పచ్చిపుండై కడకతఁడుకులోద్ధరణోద్యమము సాగింప నిశ్చయించి స్వగ్రామము వీడి పోవనిర్ణయించుకొనెను. భార్యకీ కడంక ముఖాముఖిఁ దెలుపనోడికమ్మలిఖించి నిదురించుచుండిన నిమ్మికొంగునఁగట్టెను. శ్రీగాంధి మహర్షిని స్తుతించు తావునఁ గల పద్యములన్నియు రత్నములనవలెను. ఇల దిని బిల్లలను వేశ్మమును విడిచి పోనున్నపు డతని మనః పరివేదనము చక్కఁగా వర్ణింపఁబడినది. కడకేటులో యెదఁ గుదురు పఱచుకొని కులోచితపూజా విధానము లాచరించి పయనించెను. ఈభాగము పఠించిరేని యానందింపఁదగును.

మగడూరు వదలి వెళ్లుటకై దురపిల్ల నిమ్మి గుంపెడు పిల్లల వెంట
దీసికొని దేశాంతరమునకై బయలుదేరెను. మార్గమున నరణ్యమధ్యమున నడ
గొండలవంటి పిడియేన్గులపిండెదురై పైఁబడవచ్చెను. వానిధాటికి గుండెలు
వ్రీలి వారందరు చెట్టునకు గుట్టకు నొకరయి చెదరిపోయిరి. కొంతదూర
మున వసంతకుమారియుఁ దిమ్మఁడను నామె తమ్ముడును. గలిసి కొనిరి.
నిమ్మియు మువ్వురు బుడుతలొకదెస నేగిరి. నాటి మధ్యందిన మార్తాండుని
మహితా తపోద్ధతికోర్వలేక తిమ్మడు సొమ్మసిల్లెను. అతని నొక చెట్టు
కడ విడిచి వసంతకుమారి నీరమునకై వెడలి పోయెను.

ఆమె దూరమున నొకకొలకున నాకుదొన్నెతో నీరముకొని వచ్చుచు
చేరువ నొక మనోహరమగు కోనయు, నందొక వృద్ధతాపస పుంగవుని
చూచెను. ఈమె నిస్సహాయ స్థితిగ్రహించి యాముని యనేక సంస్కార
సరణులను నస్పృశ్యులసిలుగులు దొలగింప నాబాలిక యాచరింపఁ దగిన
కర్తవ్యములను బోధించెను. వసంతకుమారి కలక దేరిన మనసుతో నతని
యనుమతిఁగొని తమ్ముని యెడకు వచ్చెను. కాని దాహవేదన కోర్వలేక
తిమ్మఁ డమ్మహావనము దాటి రాజపురాధీశ్వరుడగు రామకృష్ణ మహారాజు
గారి రాజధాని చేరుకొనెను.

అచట నాఁటికి స్రుక్కి నిమ్మియుఁ దక్కిన పిల్లలు పడిన బాధల
వర్ణింప బమ్మకైన శక్యమ్ముగాదు. బిచ్చమునకు వెళ్ళివచ్చుటకుఁ గూడ
నామెకు శక్తిలేకుండెను. ఒక సంపన్నుఁడగు రైతామెను దనయింట
పశువులఁ గాయ నియోగించెను. అతఁడు జాలిగుండె గలవాఁడు. అతని
యంగన యపారకోపస్వభావ. ఏ పనియందైన క్షణమాలస్యమైన నక్కొమ్మ
దండమ్ము నిమ్మి నెమ్మేనిపైఁ దాండవమ్ము సలుపును. కోడికూతతో
మేల్కొని మధ్యరాత్రము వఱకొకచోఁ గాలూని కూర్చుండనోచక
దడయెత్తు గుండెలతో వడకెత్తు చేతులతో తూగాడు దేహయష్టితో
నిమ్మి గృహకార్యమ్ముల సలుపుచున్నను నామెకుఁ దృప్తిగలుగదు. గడియ
కొక రక్తబిందువు తగ్గుచుండు బడుగుశరీరము నీడ్చుకొనుచు నొకనాఁడు
నిమ్మి గొడ్లఁ దోలుకొని వనమున నేటిదరిఁజేరి యొక పొలమున వానిని నిలిపి
యొక చెట్టునీడఁ బిల్లల ముందిడుకొని కూర్చుండెను. నెమరులు వేయు

-చుండిన పసులు కొంత వడికిఁ గదలినది దాటిపోయెను. అంతఁ గొంతవడి కంతరిక్షమ్మున జేటయంత మబ్బు క్రమ్మి యంతంత కతిశయించి భువన ప్రళయముగ వర్షింపసాగెను. ఆ వర్షపాతమ్మునకు పశుపక్షి వృక్ష సంతానములుచెడి క్షితిపైఁ గుప్పలైపడెను. వనమంతయు నేకార్ణవమయ్యెను. నిమ్మిపశువు లెందరిగినవోయని చూచెను. తోడనే భయంకరముగ గర్జించుచు దనపై దూకురైతు రాణి మనఃఫలకమునఁ దోచెను. దడపొందుకొను గుండెలకుఁ గరపుండరీకము నడ్డి- తీవియలతో పిల్లలనొక వృక్షమూలమున గట్టియామడయడుగగా నాపదఁతి వడివడి బరుగిడెను. పసువులఁ జేర్చు కొని మఱలించినది యావలిగట్టునకుఁ దెచ్చెను ఇంతలోఁ బైనీరువచ్చినది పొంగి పొరలి పాఱుచుండుటఁ గాంచి దాటరాఁజాలకయందే నిలిచెను.

నీటిపెంటఁ దేలివచ్చి దండుగట్టి దూకెడు మండూక కాకోదరముల చూచిభయమొంది పిల్లలు పెనఁగులాడి తీవియలు తెంచుకొనిరి. అమ్మా! యని బిట్టుకేకలు గొట్టుచు బిల్లలు మువ్వురు తల్లిఁ జేరునత్యంతతో నొక్క- మొత్తమ్ముగాఁ బ్రవాహమ్మున దిగిరి. అగాధ జలప్రవాహమ్మున మునింగి జలసమాధినందిరి!

గొంతు పగులునట్టు లెలుఁగెత్తి యేడ్చుచు నిమ్మిబుద్ధి విభ్రమము నొంది మూర్ఛిల్లెను. ఈ నడుమఁ బశువులు దాట్లిడుచుఁ బరువెత్తి పోయెను ఇప్పట్టునఁ గరుణము మహోన్నత స్థాయికెక్కినది. సాయంతమైన పిదప వర్షము తగ్గెను. ఎఱుదీసెను. నిమ్మిరిక్తహస్తయై చిమ్మచీఁకటిలో నిల్లు చేరెను.

పశువులఁ దోలుకొని రాలేదని రైతురాణి రుద్రాణివలెరేగి నిమ్మని నిశాతకశాఘాతమ్ముల పాలుచేసెను. మేనుచిల్లులు వడిరక్తము జడివట్టి కురియనిమ్మి సొమ్మసిల్లి పడెను.

అస్పృశ్యతా నివారణమునకై వసంతకుమారి గారొకరాత్రిముగా దిరుగుచు నుపన్యాసము లొసంగు చుండెను. ఈ ఘట్టమంతయు రససమాకీర్ణము ఆయుపన్యాస భాగములను దేవదూతలు సైతమవధానముతో నాలకింపఁదగినవి. ఉప్పొంగివచ్చు హృదయావేగముతో నామె విసువుదోఁచి

మ. „వలదింకన్ బదికోట్లజన్మములకీ పాపిష్ఠమౌ భారత స్థలిఁబుట్టొందఁగ" నంచువగచు భాగములఁ జదివిన నెంతటి పాషాణ హృదయుఁడైనఁ గఱఁగినీరు గాకపోఁడు.

కొన్నాళ్ళకు రైతురాణి చేసినయొక కల్పితదోషారోపణమున నిమ్మని రాజభటులు గొనిపోయి చెఱనుంచిరి. దుండగీండ్రగు కొందఱి తరకులజాలు చేసిన కుట్రవలన వసంతకుమారికిఁ గూడ నట్టిదుస్స్థితియె పట్టెను.

అపరాధపరిశీలనమున కేర్పాటు చేయఁబడిన దినమునఁ దల్లిబిడ్డల న్యాయాధిపతి యెదుర నిలిచిరి. అచ్చట న్యాయాధికారి వారి నెగాదిగఁ జూచెను. అతని కనుదమ్ములు చెమరించెను. కలముఁ బట్టుకొనఁ జాలక పోయెను. తొలుత నిమ్మియుఁ బదపడి వసంతకుమారియు హృదయదారకమైన వారి విషాదగాథల వివరించి విన్నవించుకొని „నిర్దోషుల"మని నివేదించుకొనిరి. వెంటనే న్యాయాధిపతి పీఠమునుండి డిగ్గి వారిముంగల నేల వ్రాలి నమస్కరించి చేతులు జోడించుకొని నిలిచెను విద్యావిశేషము కతమున రాజ పురమండ తేండ్రుని మన్ననవడసిన యీ న్యాయాధికారి వనమధ్యమున వసంతకుమారికిఁ దెలియకుండ వెడలివచ్చిన తిమ్మఁడే! అనుఁగుదల్లియు నక్కయు నిర్దోషులని తీరుపుచేసి తిమ్మఁడు తన యున్నతోద్యోగమునకు స్వస్తిచెప్పెను. అందఱుగలిసి స్వకులోద్ధరణ మహోద్యమము సాధింప వెడలిపోయిరి.

కథావస్తువుఁ గారణమాత్రముగాఁ గొని యేండ్ల కొలఁదిని హృదయమునఁ బొంగి పొరలి యొకతట్టుకొనివచ్చు వేదననుగవి యిట్లు గ్రుమ్మరించెనన సాగినది కావ్యము. గ్రంథముఁ బఠింప నారంభించినంతనే!

సీ. „అస్పృశ్యతామృత్యువాస్యంబునను జిక్కు స్వజనుల యాతనల్ సైపఁజాల!
అంతకు మీఱ మా నగ్రవర్ణులు దయాపరులు! వారలఁ దప్పుపట్టఁజాల!
యెన్నికల్పములకే నీ విషాదసమస్య తృప్తిమైఁ దీఱునంచెంచఁజాల!
నలువదికోట్లు జనమ్ముఁగాదని పాలకులు నుద్ధరింత్రని తలఁపఁజాల!"

గీ. ననుచు, హృదయమ్ము పచ్చిపుండై వగర్చి
చేయి చెక్కిట నిడి, కురిచీని వ్రాలు

సుకవిశేఖర బిరుదుండు జోసెపుకవి
చంద్రు విగ్రహ మెదుర సాక్షాత్కరించు!

పలుకులతోఁగాక, హృదయముతో వెలువడు కవిత్వమిట్లుండును. ఇది యతిశయోక్తి గాదు. కవి నలరింపనెంచి చూపిన యుక్తి గాదు' దానితోఁ బ్రసక్తి లేదు. ఇది సహజోక్తి, సత్యోక్తి. ఇది వీరకరుణములు చెలిసగముగఁ బంచుకొనిన చిఱు కావ్యము. విరిసిన విరజాజి యోవరులవలె నిందలి పద్యప్రసూనములు కరము బరిమళించు చున్నవి. రత్నములవంటి పద్యరాజితో నొప్పారి యిది రత్నాకరమనఁదగియున్నది. వీరకరుణములఁ జిత్రించుటయందీతని దండె వేసిన చేయి. ఎంతటి యావేశముతో నుబ్బాఁతలూగు ఘుట్టములనైన నితఁడు తనసౌమ్యతకుఁ గొంత పట్టీయడు?

మ॥ అవమాన ప్రదమంటు దోసమును మాయందుంచి కోపాగ్నిచే
తవెలిన్ బెట్టి దురంత కష్టముల నొందన్ జేయఁగా బూని నా
రెవరో! వారలె మమ్ముఁబ్రోవవలె! నంతేకాని దిక్కెవ్వరీ
యవనిన్ మమ్మునుఁ జక్కఁ జూచి సమభాగ్యంబిచ్చి రక్షింపఁగన్?

ఇదియుదాహరణము; ఏకులము భావిశ్రేయస్సౌభాగ్యము లాకులము వారి సత్యవర్తనము నిరంతరకృషిపై నాధారపడియుండుననియాయననిశ్చయము.

మ॥ ఎవరో వచ్చి సమస్తమున్ సలుపరంచేలా విచారం "బని
వసంతకుమారిలోఁ బ్రవేశించి వగచెను తమవారి తప్పుల
ను గప్పిపుచ్చఁడు ఒరుల గుణముల మఱుగు పఱుపఁడు
ఇతరులయెడ నొచ్చిన నోరనొక పొచ్చెపుమాట నేనుచ్చరింపనిచ్చగింపక.

('Sandle wood even when buring emits perfume')
అనునుడి నన్వర్థమొనర్చినాఁడు.

బంచములనియు, మాలలనియు వెలివారనియునంటరాని వారనియు, జెప్పరాని వారనియు, దూరముంచిన కాలములు గడచిపోయి కరుణాసాంద్రుని కృపాయుగ మేతెంచినది.

The great work avatar is to manifest Derina grade on earth.

జగమంతట దివ్యవికాసము నించుటయే యవతారపురుషుని ప్రధాన కర్తవ్యమని నిరూపించు గాంధికకమున మనమిపుడిపుడు మంచిమాటలాడ దొడంగుచున్నాము.

గీ॥ కత్తిచేనైన వ్రణము వేగముగ మాను?
నటుల వాగ్రూపక వ్రణంబణఁగ దెపుడు!
గాయమొక వేళ మానును! గాని దాని
మచ్చమాత్ర మెప్పటికైన మాయఁబోదు!

“ తినుట నాకలిచను! వంటఁగనుటఁగాద”ను నది యమోఘవాక్యము వండిన సంభారములఁ దినినపు డాకలి తీరునుగాని పాక పదార్థముల దూరమునుండి పాఱఁజూచిన తీఱఁబోమిసత్యమకదా! అట్లే సాంఘికముగఁగొంత యుత్సాహాభివృద్ధులు చేకూరిన వారికి నెమ్మది గలుగును గాని చప్పిడిమాట లనే శూన్యహస్తములతో, దృప్తి గలుగదు, పరిమిత పరిమాణముగల యప్పు డగ్ని నార్పుట సులభము గాని యది చెలరేగి మహాగ్ని యైనపుడు మహానదు లైనమట్టుపెట్టఁ జాలవను షేక్స్పియరు మహాశయునిసూక్తి సత్యము, తెగు వరకు దంతిబిగింపరాదని పెద్దలనుచుందురు. ఉన్నవిషయములు యథా తథములుగా లిఖించిన జోసపుకవి సత్యప్రీతియు ధైర్యమును బ్రశంసా పాత్రములు,

ఈకవి రసస్వరూప స్వభావములఁ జక్కఁగ నెఱిఁగిన ప్రౌఢ. అపురూపములగు నానుడు లెన్నియో వాడఁబడినవి.

నిండుకీర్తి పండు వెన్నెలలుఁగాయ,
లేనగవునిగ్గు మొల్లమల్లియలు చల్ల
కానఁబడనట్టి మగనికై కాకితోడఁగడురయమ్మునఁ గన్నీటి కబురునంపె
ఏ యడవులు పట్టెనో యాత్మనాథుండు,
తలనీడ తొలఁగిపోయె,
అన్నెము పున్నెమెఱుఁగ,
చింతయే! ధాత! మావ్రాత! పెద్దరాత!
కొంగవాల్గత్తికిఁ గొలుపుచేసె,

ఇట్టి ప్రయోగము లెన్నియేని గలవు. ధారా ప్రవాహ వేగముననెం దేని సందుకొనుటగాక కొందరు కవులు, కావలెననియే తమగ్రంథములలో నన్యదేశీయముల వాడుచుండుట పొడగట్టుచున్నది. కాలమును బట్టియిట్టుల యభిప్రాయాంగీకారాదులంత యవసరము కాదు, కాని మనభాష సర్వ సమృద్ధమై శబ్దప్రపంచము విశ్వవిశాలమై యలరారుచున్నది అట్లు స్వతః స్సమృద్ధముగా నపుడన్యదేశీయశబ్ద పరిగ్రహణ మనకాచరణీయ మేయగును నాయొఱిగి నంతవరకు మనబాసకట్టి యిక్కట్టు పట్టలేదు. ఒండు రెండు చోటుల నటి విదేశీయ శబ్దములు కనబడఁగా వానిని దొలంగింపుమని చెప్పితిని కాని యంతకన్న నీసుకవిశేఖరుని సత్కావ్యమున నాయొనరించిన సంస్కార మావంతయు లేదు.

సర్వతోముఖ వికాసముతో ప్రపంచము ముందునకుఁ గదలి పోవు చున్న ప్రస్తుత కాలమున నిట్టి సాంఘిక కావ్యములు ముఖ్యావసరములు. ఇట్టి కావ్యము నభిలషించి జోసపుకవి నర్థించి ప్రోత్సహించి యండనుంచుకొని ప్రేమించి గౌరవించు వదాన్య ప్రభుశేఖరులు గుండేపుడి పురవరాధీశ్వరులు శ్రీ శ్రీ శ్రీ కొల్లూరి ఉమామహేశ్వరరావు దొరగారి యుదారప్రేమ మయ మృదు హృదయమును బదివేల విధంబుల నభినందించుచున్నాను.

జ్ఞాన సంపన్నులగు నిట్టిప్రభువులు నిశ్చయముగ భూలోక పారిజాత ములనవలయును. ఆయురారోగ్య భోగభాగ్యాధికము లొసంగి పరమేశ్వరుఁ డీపరమవదాన్య ప్రభుశేఖరుని వీరి వెంట శ్రీ జోసపు కవిశేఖరుని గాపాడుఁ గాతయని ప్రార్థించుచున్నాను,

కవిసార్వభౌమ, మహాకవి, మార్తాండ, వీరప్రభంబ పరమేశ్వర
Etc.

ప్రొద్దుటూరు,
1—3—46

డి. రాజశేఖర శతావధాని.

కృతిస్వామి



ఆంధ్రకేసరి

శ్రీ టంగుటూరి ప్రకాశము పంతులుగారు

# కృత్యవతరణిక.

శ్రీలలనామణీ ప్రకటసేవనశోభిత పుష్పవాటికా
మాలలఁదాండవించి, పరమప్రభసృష్టిని నేలుదైవమూ
ర్త్యాలనియోగి బ్రహ్మకుల వీరుడు దారుడు మా మహేశభూ
పాలున నంతకీర్తి విభవంబులతో నభిషిక్తుఁ జేయుతన్.

గుణరత్నాకరుఁడాప్త బాంధవుఁడునై క్రొంగ్రొత్త తేజఃప్రభం
జనవుం దేరులగొల్పుఁ దీటి విజయస్తంభాల నెత్తించి దాం
తినిశాసించి ప్రశాంత చారితముతో నిస్తంద్ర త్యాగంబు గు
ప్పిన శ్రీవేంకటరాణ్ణృపాలు కరుణావేశంబు సామాన్యమే?

ఘనచాణక్య యుగంధర ప్రభృతులన్ గాలించి యోడింపగా
ననువౌపేశల పాండితీప్రకట రాజ్యజ్ఞాన సూత్రాంశ శో
ధనఁగావించి యఖండపండితుఁడునై ధర్మార్థతత్త్వంపు వ్యా
ఖ్యనుసృష్టించె ప్రశాంతబుద్ధి బలబ్రహ్మాండం బురూపించుచున్

కారణజన్ముఁడై సుకవికాంక్షలగాధకు మేల్మిపచ్చి బం
గారపు నీటిపోత నయగారపురంగుల సొంపులద్ది, క
న్నీరు వెలార్చు పేదలకు నిశ్చలచిత్త వచోమరంద సం
భారబహూకృతి ప్రకటభాగ్యమొసంగు దయాసముద్రుఁడై.

వేంకటరాయచూడమ ప్రవీణుల పూర్వతపస్సు భోగము
ద్రాంకవిభూతిపావన లతాంత రజోవిసరప్రశస్తపుం
బాంకము పక్వమయ్యె సన; పూత చరిత్రుఁడు రామకృష్ణని
శ్శంకుడు మామహేశగుణసాంద్రులు బుట్టిరి లోకపూజ్యులై.

ఆరయఁగష్ట జీవులకు నార్త శరణ్యత మేల్మిపచ్చి బం
గారపు జిల్గుపుప్పొడుల గంధపు గొండలగాన్కలిచ్చి పొం
గారు దయాసముద్రమున యందుసుఖించుచు మేల్ వసంతకుం
గోరినప్రాపనీయుఁడయి కుల్కు నుమాప్రభు నెన్న శక్యమే?

కరుణాసాంద్రుఁడు కర్మవీరుఁడు జగత్కళ్యాణ లోలుండు దు
ర్భరదారిద్ర్య దవాగ్నితప్తులకు నవ్యాజాను రాగప్రభా
సరసాంతఃకరణాబ్జ గంధముల నశ్రాంతంబు నర్పించి సం
బరమున్ బ్రోచెడి ధర్మమూర్తియును నై భాసిల్లు ప్రఖ్యాతిగన్.

ఎవ్వాని ధర్మజయేందిర వాల్బ్రాపు
దారిద్ర్యజనుల ముత్యాల సరము
ఎవ్వాని కరుణా రసేప్సిత పీయూష
మసదల క్షుద్బాధలార్పు సోన
ఎవ్వాని దాతృత్వ మేకైక దీక్షలు
పేదల మొగసాల వేల్పు తరువు
ఎవ్వాని త్యాగంపు టేపారుగుణ లతల్
శరణాగతాళి వజ్రాలమేడ.

అతడు నిస్సీమ దాన కళానురాగ
పూరిత నితాంత భక్తిపరిపూత చరితుఁ
డార్యసన్నుతుఁ డార్త జనాభిమాని
యతులహృదయుం డుమామహేశాగ్రివిభుడు.

వెలివాడన్ దపియించు నిమ్నజుల దుర్వృత్తుల్ విచారించున్
వలపున్ విద్యలు బుద్ధులుం గఱుపఁ గంభం బెట్టు పట్టంబులో

పల స్థాపించిన ధర్మశాలలకు సద్భావంబుతో వేయి రూ
కల ధర్మంబుఁ బరాకులేకయొసఁగెన్ గారుణ్యబుద్ధిప్రభన్.

చల్లనిచూపుజుంజురుల చంద్రునివెన్నెల నిగ్గుమల్లె పూ
జల్లుల తిన్నెపైఁగులుకు జప్పరముల్ సవరించి, చీకులన్
దల్లడమొందు పేదల యథావిధిఁ దృప్తులగానొనర్చి సాం
పిల్లగ దీవనంబులిడు ప్రేముడి నిక్కపు జాలిపెంపునన్.

దుగ్ధాన్నదానంబుతో పాటు ఛాత్రుల
కు ధనంబు ముంగొంగు గురిసినాడు
చెదలువాతెఱఁజిక్కి జీర్ణించు కబ్బాల
సిరికి సింగారంబు జేసినాడు
తనపేరు లోకంబు వినఁగూడదను నిష్ఠఁ
గవిపోషణకు గజ్జెఁ గట్టినాడు
సరసత్వమునుదూచి జాతిభేదముమాని
సత్కృతుల్ గొన జేయిఁజాచినాడు.

మాట చుఱకత్తి హృదయంబు మావిపండు,
చూపు పుట్టుకతేనె జుంజురుల జల్లు,
నడక వినయాది భాగ్యవిన్యాసగరిమ,
గలిఁగి శ్రీయుమాపతిభు పృథ్విగణుతికెక్కె.

సాయమొకింతగాంచని వసంత కుమారిని గొండొకంట, నే
నాయతదీక్షఁ దత్ప్రభుమహాధిక సంస్థను సాముయేలుతో,
శ్రీయుత రామలింగకవి శ్రేష్ఠుని నానతి నిర్భయానఁబా
రాయణజేసి భక్తిమెయిఁ బ్రార్ధనజేసితి కావ్యకన్యతో

ఇచ్చిననీయకన్ననొకచే! గుణచంద్రిమ శ్రీయుమూపరిభూ
మెచ్చిననీదివాణమున మేటరిమోదముబిచ్చలించి నా
బిచ్చవుగైత కన్యక ప్రవీణ చమత్కృతిఁబొలఁజూచి నా
యిచ్చమనచ్చుఁబోయుచుఁ గృతేచ్ఛఁదీర్పుమటంచు వేడుటన్

అంతఁబరిభూత్తముండలరి యార్తశరణ్యతఁ గుమ్మరించి ని
శ్చింతమనంబువిప్పి కవిశేఖర! ముద్రణకౌధనంబు న
ర్పింతునుగాని కావ్యకృతిరీతి నమాత్మ్యున కంకితమ్ముఁ జే
యింతునటంచు భక్తిగురియించివచించె వినమ్రసూచనన్ .

వాడిననామసంపుటల వాటులగోర్కెలు బల్లవించి దో
గాడి ముదబ్ధిలేతరఁగ లందుసుఖించుచు వల్లెయంటి, పై
నీడగు భర్తవీవెయని? యిచ్చిన నాకృతి, జేనిబత్తితో
జోడునుగొమ్ము; నిమ్నజుల సోదర! త్యాగమహాభిమానమున్

# అంకితము



ఆంధ్రకేసరి బిరుదంబు లందుకొన్న
నాఁడె, దిశలందుఁ దెనుఁగుఁ జెండాతురాయి
విజయదుందుభి రవళిశబ్దించి గవిసి
దళితశాత్రవదుర్గాలఁ దాండవించె.

జిలుఁగుంబాయపు టాణిముత్తియపుఁ దేజీనెక్కి-శౌర్యాది శ
క్తుల రూపించి, దురంతశాత్రవుల వ్యాకోచప్రభాధుర్య దీ
ప్తులఁ జెండాడి ప్రసూనమాలికల భాస్వత్కీర్తి గంధంబులన్
దెలుఁగుంగోట్లను నింపెడిన్ దమమహోత్తేజంబు సామాన్యమే?

దీపితవిక్రమంబు జగతీవలయంబున నాటి కీర్తి సం
స్థాపనఁ గేతకీధ్వజ వితానము భారత వీరభూమిలోఁ
దాపి కృశించు తెల్గు సరదారుల నిక్కపుటుక్కుగుండెలోఁ
దాపరమై జ్వలించు పరితాపము దీర్చుచు త్యాగమొడ్డుచున్.

ఆంగ్లవీరశ్రేష్ఠు లదరిపోవఁ దుపాకి
కెదురుపోటొడ్డి ఱొమ్మిచ్చినావు
తెలుఁగుతల్లి సిడంబు వెలిగింపఁ జెరసాలఁ
జెమ్మట కన్నీరు జిందినావు
నిజదేశదాస్యంబు నిర్మూలనము సేయఁ
దెలుఁగుగత్తికి సానదీర్చినావు
మాడలొత్తి ఖండంబులంజలి ఘటియింప
నాంధ్రశౌర్యాగ్ని వెలార్చినావు

శాత్రవులగుండె గాలమై సర్వదిశల
గుప్పిటనుబట్టి వణకించి గుబ్బటిలగఁ
జేయునీకీర్తి పౌరుష శ్రీవిధంబు
వర్ణనముసేసి తఱచ నెవ్వాని తరము?

కులుకుం బచ్చల క్రొత్తబాకు యొఱలో గోరాడ శౌర్యాగ్ని రా
సుల జృంభించుచు మీసముల్ దివురుచున్ శోభించుచూరేగి బె
బ్బులినోష్ఠన్ జయశాసనాక్షరములన్ బూయించి దిగ్దంతులన్
బులిపింపించు నియోగి సత్ప్రతిభలన్ బూజించు కీర్తిద్యుతిన్.

ఘోరతమిస్రపుంజములగూలి యుగంబుల బండిగాను కం
గారు హదాటు రాపిడి చికాకు దొసంగుల నీదలేక క
న్నీరు వెలార్చు పంచముల నిక్కపు టంటుతనంపు నీచ దు
ర్భర పరంపరల్ జిదిమి బాసటగూర్చు ప్రకాశరాట్ప్రభా.

తెలుగుఁబ్రభుత్వ వైఖరుల దీవ్య ఖండ జయధ్వజాలము
ద్రిలవహించి ప్రేముడి స్వతంత్రతవర్తిల వేచియున్న యాం
ధ్రులతొలిబాము నోములకు తూహాలదీక్షల బైఁడిచేను నీ
వలన ఫలించి కీరుతులు బర్వఁదొడంగెను దేశదేశముల్.

తెలుఁగురాడ్దినకరు దివ్య తేజో మహో
మాణిక్య మకుట సంపద్విభూతి
మంత్రితిమ్మరుసు సమగ్రరాజ్య రహస్య
రత్నఖడ్గప్రభా రభస పటిమ
కొండవీటి గుహల కూలివా పోయెడి
శ్రీనాథ కవితా పరిమళంబు

ఎఱగడ్డపాటిపైఁ బరువు నర్పించిన
ఖడ్గతిక్కన శౌర్యకథలబారు.
వీరబొబ్బిలి కడగంట విస్ఫురించు
యాంధ్రతేజంబు నీలోన నవతరించి
యఖిలభారత వర్ష కళ్యాణమహిమ
లుదయనై పొంగి యుబ్బాత లూఁగుచుండె.

భారతమంత నొక్కటిగ పట్టిన పట్టును వీడకుండ దు
ర్వారమహోగ్రదాస్యముల బాకుల గ్రుమ్మిన జంకకుండ కం
గారు గదింపకే విజయఘంటికలన్ సడలించి రోషమున్
దీరిచి పోసి మీసముల దిద్దిన బంటువు లోకమూఁగగన్.

కలమును గత్తిగా నడపి గండరనెత్రు సుధాజలాల పె
ల్లలల నలుంగు తుంపురుల నార్ద్రమొనర్చుచు నిన్నుగన్న మా
తెలుఁగుల పోతుగడ్డకు యతీత యశంబుల సందడించి మే
ల్కొలుపుమ వీరగాథలకు కోడెవయస్సులు చెమ్మరింపగన్.

దయఁజూసిగొనుమ గోదావరి బుత్తెంచు
కనక రత్నాభిషేకముల కాన్క
ఆలింపుతుంగభద్రానది పఠియించు
వలపుఁగైతల జోలపాటగముల
దీవింపు కృష్ణానదీదేవి గొనివచ్చు
జయమంగళము వీణెయలసొంపు
కృపనాదరింపు శ్రీకృష్ణరాయల కత్తి
బంపుప్రతిష్ఠైక పాశుపతము.

అందుకొను మయ్య తెలుగు ఖామందులంపు
హార నీరాజ నాది సంభారమణుల
కరుణఁబాలింపు బేదల కంటినీటి
దుఃఖచరితల సంతోష దోహదమున.

స్వాతంత్ర్య భూరినిష్టాభేరిమ్రోయించు
రామలింగారెడ్డి ప్రాభవంబు
రాజకీయజ్ఞాన రత్నఖడ్గము ద్రిప్పి
ఘనత జాటించు రంగా ప్రతిజ్ఞ
శాంతియుద్ధంబుల సత్త్వంబు రూపించు
పట్టాభినిస్తుల పౌరుషంబు
పిరికిపందయెడంగ వీరగంధముజిమ్ము
తెలుగుసర్దారు ప్రదీప్తిమహిమ.

శ్రీసరోజినీదేవి, కాళేశరాయ
ప్రథితకోట్రెడ్డి, కూర్మయ్య, బాపినీడు,
వేంకటప్పయ, సుబ్రాయ విమలప్రభలు
మంగళము గూర్చుగాత యమాత్య నీకు.

పూచిన గొండమల్లియలపుప్పొడి దుమ్ములకమ్మతావు కా
ణాచి వరాలతేరుపయి నల్గుల వెట్టి యుమామహేశు పూ
జాచరణీయభక్తిన వసంతను నీకిడుచుంటి శీలముం
దూచి, వివాహమాడి దయతోఁగరుణింపుమ పెత్తనంబులో.

# వసంతకుమారి



## ప్రథమాశ్వాసము

కాలతరంగిణీ భయదగర్భ తలాంతర సీమలందు భూ
పాలశిఖామణుల్ గులవివాదకులెందరో దేశనాయకుల్
గూలి యుగంబు లబ్దములు గూరుకుజెందినవారో ? యేదియే
హేల గమింపనున్నదో ? మఱేరికిదోఁచును భావిమర్మముల్.

మానవుఁ డొక్కయాత్రికుఁ డమర్చినజంత్రము పాంచభౌతికా
ధీన నికృష్టవాంఛలకు దృష్టిపరంపర మోహానంపుట
జ్ఞానముగ్రుమ్మరించెడి యశాశ్వతసార్థవిహీనజీవిసుం
తేనిబఠింపఁ డీశ్వరుని దివ్యతరప్రతిభా ప్రబంధముల్.

ఎవడునితాంత ధైర్యమువహించి ముదాన నిజాంతరంగమం
దవగతమైజ్వలించెడి మహత్తర శక్తియుతాగ్నిఁగాంచి యో
ర్చి, వగపుదైన్యమింధనము జేసి తదాగతసుప్రభాళితో
బ్రవిమల తత్కృషిఁగలువువాడె మహాత్ముఁడు నిక్కువంబుగన్

అతనిచెమ్మటబొట్టు లందంకురించును
సర్వప్రపంచ ప్రశాంతమహిమ
అతని యడుఁగుజాడలందుఁ బ్రస్ఫుటమగు
దేశాభ్యుదయ భాగధేయ ఫలము

అతని విజ్ఞాన దివ్యజ్యోతు లందుద్భ
  వించు లోకోత్తరప్రీణనంబు
అతని నెత్తురుచెమ్మలందుఁ బ్రతిఫలించు
  పరమదరిద్రుల సిరులకుప్ప
పూజ్యుఁడై రాజ్యతంత్రాంగముల భరించు
నధిపుఁడైజ్ఞానియై త్యాగియై ము వాన
నాతఁడూరేగుచుండు దిగంతరాళ
మత్తసితవారణంపు టంబారులందు.

ఆతతనిష్ప్రయోజకపుటాశలయందు మనస్సునిల్పి ని
ష్ణాతలునై విశేషధనసంపదలార్జనఁ జేసి, దానిసం
ఖ్యాతిగ దానధర్మములకై వినియోగమొనర్చుచుం పరం
జ్యోతిమహత్త్వ తత్త్వపరిశోధన జేతురు సజ్జనోత్తముల్.

యాత్రికులయ్యుఁ గొందఱు మహత్తరకార్యరథాల నెక్కి స
న్మిత్రతఁగొంత యేగి దృఢనిశ్చయభావము వీడి యైహికీ
నూత్రసుఖైక దేవతను స్తోత్రము జేయుచుఁ దత్ప్రయత్నపుం
బాత్రముదీఱనంచలరు, బండునధోగతి గర్భసీమలన్

చీకురువాయి చేడియలు జేగురుముత్తియపూపగుత్తిఁ గ్రొం
జీఁకటిపేదరాల కిడి చెన్నువహించెడి జాంబునింటఁ బే
రాకటమూల్గుశంభుఁడను నద్రికుమారవరుండొకండు యా
త్రీకుఁడుగాను బుట్టెను విధేయత మోమునలంకరింపగన్

పుట్టి హిమాద్రివంటి పరిపూర్ణ యశస్సులురాణఁజెందఁ జూ
పట్టెడి భావిజీవితముపై మృదులంబగు లేఁతచూపు క్రాలన్
బెట్టి మనఃప్రభావములవిప్పి శుభోదయ మార్గసిద్ధికై
గట్టిప్రయత్నమున్ సలుపగాదలమొత్తదలంచెధీరతన్

అతని జాతకచర్య మహాఫలమ్ము
లజుని పుస్తక భాండారమందుఁజదివి
తన్మయత్వంబున దరిద్రతావధూటి
కౌఁగిలింత పట్టాభిషేకమ్మొనర్చె.

పరమదారిద్ర్య దేవత మురిసి గురియు
స్తన్యముల గ్రోలఁగలుఁగు ప్రశస్తభాగ్య
మొందఁజేకిబుడమిలభించు నింపుఁగులుకు
నిండుగీరితి పండువెన్నెలలుగాయ.

అతిచాంచల్య విశాలభాగ్యమిడు స్తన్యప్రాభవాభ్యున్నతిన్
జతలై పెంపగు కండరంబుల వృథాసౌందర్యసౌభాగ్యసా
రతకన్నన్, ముదమార లేమియిడు క్షీరాలాత్మ దాహంబుఁదీ
ర్చుతుషారామృతమౌ, యశోమహిమప్రాచుర్యంబు
లొప్పారగన్.

సరసాన్నసారప్రసార విహీనత
వనరి దేహంబు జిక్కినమఁజేమి !
స్థిరసౌఖ్యభోగాత్త పరవశత్వము లేక
మనసు మలమల మాడినమఁజేమి !

అజ్ఞానజగమునందడుగంటి తులలేని
సిలుగులంజెంది యేడ్చిననునేమి!
నిస్సహాయకశోచనీయ బీభత్సచే
నలసిదుఃఖాకులుఁ డైననేమి!
ఆతఁడోడ్చు కన్నీటి దుగ్ధాబ్ధినుండి
రగులునిట్టూర్పు పొగ దుమారములనుండి
బాడమువిజ్ఞాన లక్ష్మిసంపూజ్యశస్త
కీర్తి; దిగ్దేశముల వణకింపఁజేయు.

అస్థిపంజర సౌధగర్భాంతరముల
వెలిఁగినవికావు వరదీపకళికలెన్నొ?
రాజులెందరో? యైశ్వర్యరాశిపిడి
కోరిలేమినిదర్శించు కొనిరికారె?

తనమాహాత్మ్య మెఱింగి పైకొను నితాంతక్లాంతఝంఝానిలో
ల్బణబాణాల కొకింతఁ దొట్రిలక సద్భావప్రసూనాల పో
వునఁబూజింప, సుగంధతైలములచేఁ బ్రోక్షించి లోకోన్నతా
సనభాగ్యంబులఁ గ్రుమ్మరించును సముత్సాహంబు సంధిల్లగన్

తనవికారస్వరూప పాత్రనుఁగనుగొని
యమ్మొయని భీతిఁజెందెడి యెమ్మెగాండ్ర
నెంచిజగతికి జోలెగట్టించిత్రిప్పు
మీఁదుక్రిందుగ, క్రిందును మీఁదుఁచేసి.

జ్ఞానవిశాలశక్తులు, ప్రశస్తమహోన్నత సత్యశీల సం
ధానము, భావనిశ్చయము, దానగుణోన్నత వైభవంబు, వై
జ్ఞానిక సంప్రదాయము, విచారణదక్షత, లేమినేర్పు పా
ఠానలభించు నీవులముటాలు మనుష్యుని భావివృద్ధికిన్.

కలమాన్నంబుల నారగించినను, బంగారంపు టుయ్యాలలన్
వలపుంగుల్కుల నిద్రఁజెందినను, భాస్వత్సౌధ సింహాసనం
బులఁగ్రీడాదుల సల్పియున్న నొకచో బూజ్యప్రభావాఢ్యుడై
పాలుపుణ్ భాసిలకుండునే మొగద? శంభుండెంత కీర్త్యంశుడో

అణువై పుట్టిన వానిశక్తుల విపర్యస్తప్రభావంబు పా
వనమై మేరువుసేయు కార్యముల సంభావించియొక్కొక్క పా
టునఁజేయించు నొకొక్కకాలమున, కూడుంగుడ్డ లేకుండగా
మనుజేంద్రాదుల నేడిపించు యుగధర్మంబిట్లు వర్తించెడిన్.

పానరంగాదుల లేని కష్టశరముల్ పుంఖాను పుంఖంబు లా
తసిదారొక్కన్న రవంతచింతిలక యంతశ్శక్తులన్విప్పి నే
ర్పునఁదానొజ్జల దృష్టికిన్ గురియునై పూరించెవిద్యార్థి జీ
వనవారాశిని దాటుసేవ లెటులో బ్రాజ్ఞన్క భాగ్యంబునన్.

వసుధలో మహాపురుషుల భావిజీవి
తంబులకు శైశవంబేగదా ప్రధాన
మైన చక్కనిమున్నుడియై యొకంట
రాణఁజెందు నెల్లెడలఁ బరాక్రమింప.

సూర్యభగవానుని ప్రభావిశుద్ధ కలిత
జీవనంబంత దోల్తఁ బ్రాచీనగమునఁ
గోఁచురక్తాభయందె గంతులను బెట్టి
నలవుఁగులుకులతోడ నంపతిలుచుండు.

పుట్టినది పేదకులమైనఁ బొగరుబోతు
కాక తనమహోగుణముల కాంతిజిమ్మి
కడఁగి కడగండ్ల కాఱుచీఁకటుల నడఁచి
యాత్రసాగింప దృఢనిశ్చయాత్ముఁడయ్యె.

పాపము! గండుపేద గుణవంతులనందగువారి జాబితా
లోపలమిన్న కీర్తి వెలుంగు బయల్వఁబచాఱు సేయఁగా
బ్రాపక భాగ్యమున్గొన విరామము లేని తపస్సుఁజేయు దీ
క్షాపరతంత్రుఁ డాప్రభు ప్రశస్తవదాన్యుఁడు కల్గినంతలో

మాతృగర్భమునందె మనుజకోటిదురంత
కష్టప్రబంధముల్ గఱచినాడు
జగతికి భూతహింసావర్జిత సమస్య
తైలాభిషేకంబుఁ దనిపినాఁడు
నిట్టూర్పుగాడ్పుల నిగుడు పేదలపైన
కరుణారసంబుల గురిసినాఁడు
దిశలంటి తిండిగ్రించి తిరుగులేమికి త్యాగ
శీలగంధంబులఁ జేర్చినాడు

కడఁగికన్నీటి పన్నీటి కాన్కలంపు
గండుపేదల హృదయోపకార్యసీమ
లందుఁబాడుకొన్నాఁడు దుఃఖాంతగీతి
ధీరసహానంపు వీణాతంత్రీరవమున.

నిండుజవ్వన మవ్వము నెలముకొనియె
పాంచభౌతిక దేహసంబంధశక్తి
వజ్రముల తలంబ్రాలతోఁ ప్రకృతి కన్య
దీవనములంపె కీర్తిచంద్రికలుముసర.

చిక్కని నవ్వుక్రొంజిగి మోముదమ్మిపై
భావుకజ్యోతులు ప్రతిఫలించు
ప్రథితజిహ్వాక నాట్యరంగస్థలంబున
భారతీదేవి పొంగారుచుండు
జుంటితేనియ వానజొబ్బిలు వాక్కుల
వినయభావాలు బర్వెత్తుచుండు
ధీరమా హృదయకేదార సీమలకరు
ణాస్రవంతులు ప్రయాణంబు సేయు
కడుపుఁజిచ్చున నలిదేఱి కాలగతికిఁ
బ్రాణదానంబు జేసినవారి పాడు
వడ్డ గోరీలపైఁబడి ప్రకృతి కాంత
చెడుగు యేల్పడుల దలంపుఁజేయుచుండు.

కాఱుచీఁకటులల్లు గవిసివంచించెడి
వలపుటుచ్చుల కౌగ్గిపట్టుబడక
కులపర్వతంబులవలెఁ బెచ్చుబెరుగున
హంకారమునకు సన్న్యాసమొసఁగి
కాఱుదెబ్బలిరీతిఁ గాండ్రించుగర్వ ప్ర
భంజనమున వెనుకంజవైచి
మబ్బుతెరలపోల్కి మార్కొను నాశాపి
శాచీప్రతిభకుప్రశాంతిఁ జెప్పి

దుఃఖ సామ్రాజ్యమందు నెత్తురులు గుఁసి
యధికసౌభాగ్య భాగ్యంబు లావహిల్ల
జ్ఞానశక్తుల వికసించినాఁడు దిశలు
భ్రమసి నిర్వ్యాజమోద బాష్పములు గురియు

అతని హృదబ్జ సీమను విహారమొనర్చెడి శాంతిసత్యదే
వతముదమార బేదలయవారిత బాధలనాలకించి యం
చిత కరుణా తరంగములఁజిమ్మి దృగశ్రుల సేదదీర్చి దు
ర్గతి చరితార్థగాథల గరంబెడలించు బ్రశాంత దృష్టితో.

కాని విధాతవ్రాసిన ప్రకారము నాతని సద్గుణంపు సాం
బ్రాణి పరిమళంబుల ప్రభావ పరంపరజువ్వరింపఁగా
మానెమటెందుకో; మనుజమాత్రుల బుద్ధులకందరాని వై
జ్ఞానిక కావ్యమందితని జాతకచర్యలు ముందెటున్నవో.

కూలికిదోసిలొగ్గి తనకూటికొఱంత యొకింత దీర్చుకొం
చాలుడి యాలుబిడ్డల క్షుధానల సంజనితోగ్రదుఃఖపుం
గీలల నశ్రువర్షముల గీటడగించుచుఁ గష్టజీవియై
కాలవిపత్తులన్గనుల గాంచుచు రాశికిసబ్బరంబునన్.

నెలవుల్ జిక్కక కూటికై క్షుభితులై నీచాతినీచంపులో
యులగన్నీరు వెలార్చు పంచముల బాలై యున్న యస్పృశ్యతా
నలమార్పించి స్వతంత్రులై బ్రతుక నండల్ లేని తద్దేశ దుః
ఖలతౌఘంబులఁద్రుంచి ప్రాపుఁగఱుపంగా బూనెధీరాత్ముఁడై.

కూటికిలేకయే సతము గొందలమందుట సామరస్యమన్
మాటతెఱుంగనట్టి కడుమందుల యిండ్లజనించిభూరికా
ర్యాటవిలోఁ జరింపఁగ బ్రయత్నమొనర్చుటటన్న చిత్రమా
నాటకరంగమై వెలసె నాలుగుదిక్కులు గేలిసేయఁగన్.

తత సంసార భయాబ్ధి వీచికల యాతాయాత విక్లాంతసం
తతికింజెచ్చెఱ బ్రాణమొడ్డి, చిఱు చింతాకంతభీతిల్లకా
తత విజ్ఞానవిశేషమార్గముల సంధానించి లోకోత్తరాం
చితసేవాధ్వజ మెత్తగాఁ దలఁచె నిస్సీమాప్రభావంబునన్.

కారణజన్ములై వెలసి క్రచ్చు భయావహ రాక్షసాళితోఁ
బోరి దిగంత రాళములఁ బూతయశంబును గుత్తకున్ గొనన్
గోరు మహానుభావులు నకుంఠితచిత్తులు, మర్మభేదమై
కారణబద్ధమైన కడగండ్ల గణింపరు ధారుణీస్థలిన్.

మన దేశాభ్యుదయంబటన్నఁ దన సౌందర్య ప్రభావంబట
న్నను, త్రైథిల్యమహాంధ్ర పట్టణసుఖానందానుభాగ్యంబుల
న్నను, నా నెత్తురు నాడునాడులను సంధానించి రేకెత్తి పెం
పను, నిర్హేతుక మోదభావములు హృద్గోళంబునన్ మొల్వగన్.

మానవుఁడై జనించి కల మర్మమెఱింగిన జ్ఞానవేత్తయై
ప్రాణికోటిఁ బరిభావరితిభఁ బొందఁ గడంగినవాఁడు దగ్రితన్
క్షీణతఁ జెందు స్వీయమత సేవకు రక్తముఁ జిందనట్టియ
వ్యాపి యశస్సు జన్మఫల భాగ్యము గాల్చునె? నేల గల్చునే?

ప్రాణము గుప్పఁబోసి పలుభంగుల ముప్పుల జెందియైననుం
గానసీమ లందుఁ గల కాలము వాసము సేసియైనగా
నీ ! సరుఁడైన వాడు గణనీయముగా నిజసంఘసేవకై
పూని శ్రమింపఁగావలె ప్రపూజ్యుఁడువాడె సమస్తమర్త్యులన్.

అవమాన ప్రద మంటుదోసమును నాయందుంచి కోపాగ్నిచే
తపెలింబెట్టి, దురంత కష్టముల బొందంజేయఁగాఁ బూనినా
రెవరో? వారలెనన్నుఁ బ్రోవవలె. నంతే కాని దిక్కెవ్వరీ
యవనిన్ మమ్ముకులచక్కజూచి సమభాగ్యంబిచ్చి రక్షింపగన్.

అగ జన్మల నెట్ట నత్యాగబుద్ధి
యందు నా యుద్ధరణ విధంబమరి యుండి
కాలపరిపక్వ దేవత కరుణ కొఱకు
స్వాగతంబిడ నుంటి పుష్పాలతోడ.

జిలుఁగు బత్తిని జిమ్మి ఆర్యుల ముటాకు
తెలుఁగు బాసను నేర్పి యాధిక్యమొసఁగి
గడ్డ మాహాత్మ్య మెఱిగించు కలిమిఁ గూర్చి
తొలుత బెంచిన యాదిమాంధ్రుండ నేను.

అట్టి నా కిట్టి దుఃస్థితు లావరింపఁ
గారణం బేమి నాదుమౌర్ఖ్యంబ; లేక
తెలివి లోపమా ! నిజసంఘబలము లేమి
యా ! అగౌరవ పాత్రమునాది నుండి,

భరత రఘురామ నల చక్రవర్తులాది
నృపుల పాలన గనులార నేఁటి వఱకు
గనుచుఁ గష్ట సౌఖ్యములకు గరము లొగ్గి
గడ్డగని పెట్టుకొని యున్న ఘనకు లుండ!

కరవైదిక్కులు బేఁటవాఱి నను దుష్కాల ప్రిభావాన చి
చ్ఛలబాణౌఘపరంపరల్ గురిసి రాజ్యభ్రష్టులం జేసినన్
బరువుంగుల్కొడి తెల్గుబిడ్డనగు నా వైజ్ఞాన ధైర్యాల కుం
బురుఁడెవ్వారలనంత పౌరుష బలంబుల్ జూపి దీపింపఁగన్.

తెలుఁగువాఙ్మయ మందుగల తీపిహరియించి
మిన్నేటియలలతో మేళవించి
పగఱనెత్తుటి వానవరదలోఁ గ్రీడించి
కనకశైలంపు గద్దెనువసించి !

మునిజనంబుల తపోముఖ్యమార్గముగాంచి
భక్తిసమాధిలోఁ బవ్వళించి!
వెంపారుకీరితి పెండ్లిపందిరులందు
జవ్వాజి పునుగు వసంతమాడి!
దిక్పతులుజల్లు బెగడుచెంద్రికము దోఁగి
లేనగవునిగ్గు మోగ్రిలమల్లియలు జల్ల
ఘనతరానందరసతరంగముల మీఁద
తుళ్లిదూగుచు దిరుగునాంధ్రుండ నేను.

భాషౌషధులబెంచి బ్రిబలిన తుంగ భ
ద్రా తరంగములపైఁ దాండవించి
పాపాపహాంబునై బరగు గోదావరి
పచ్చికబయలుల బవ్వళించి
ముక్కారు బంగారు ముద్దల బండించు
పూతకృష్ణమ్మకు బూజచేసి
చవులూరు కమ్మని కవనంబుమొలిపించు
పెనుపినాకినితోడ వియ్యమంది
తిక్కనామాత్యుఁ గైతంపుఁ దీపిఁగ్రోలి
పరమముదమున నాంధ్రుల వైభవంబు
ఖ్యాతిసౌధాల తూగుటుయ్యాలలనొరగి
దోలుతగర్వించు నాదిమాంధ్రుండ నేను.

భారతభూమియందుఁగల భాగ్యపరంపరఁ బీసపాలునం
దాఁటవవంతు నిమ్నజలకై మునుపంపిణిసేయ లేదొకో?
చేరడు నెత్తురున్నగముచేసి ముదంబున నన్నుఁగన్నయీ
భారతమాత కేల బహుభంగుల నాపయిఁగోప తాపముల్.

కారణంబు వమున్న మహావీరవరులు
త్యాగశీలంబు జగతికి ధారవోసి
పరము జేరిరి భౌతికవాంఛవీడి
వారిసేవలు నాకేమి ప్రాప్తిఁగూర్చె.

సామ్రాజ్య దేవత సాగనంపిన నాఁడు
బుద్ధునికేమని బోధఁజేసె!
వేదంబులేమని వెలిఁబుచ్చుటకు వివే
కానందునని పెనయ్యె మెరికాకు!
జగమెమిథ్యమటంచు సన్న్యసించినశంక
రునకు నద్వైతమేమని వచించె!
మక్కామసీదు ధర్మప్రబోధకు మహా
మ్మదు వక్తకేమి సమ్మదము గూర్చె!

చెలఁగిమదఖండ భరతభూముల జనించి
భావిజగతికి కర్తవ్య పారమేమి
గఱపినట్లుగ శాస్త్రముల్ గానబడవె?
అస్మదస్పృశ్యతా జాడ్యమంతరింప.

కులహీనాత్ముల రక్షణార్థమయినేఁ గ్రొంగొత్త స్వర్గంబులో
వలభాసిల్లు ప్రశాంత భోగముల సర్వ ప్రాభవానీకముం
డాలఁగం జేసి జనించినానననిన యెంతో గ్రీస్తుతత్త్వంబులో
మిళితంబై మన గాంధి యీ భరతభూమిం బుట్టె రాజర్షియై.

ఆకలి దప్పులందాశ లేశము లేక
ప్రాణంబు నరికట్టు పరమయోగి
కష్టంబులను సాత్త్వికవృత్తులఁ దూఁచి యో
దార్పు శాసించెడి ధార్మికుండు
శాంతి యుద్ధంబుతో జగమును వణికించు
పరువంపు గుండె నిబ్బరపు మగడు
పరుల కష్టాలకు బాష్పముల్ వర్షించు
నుద్దిలేనట్టి మహోపకారి
ధరసమాధాన వేద విద్యారహస్య
శాంతి మంత్రార్థతలు వెదఁజల్లి, దేశ
దేశముల తోడఁ జేకొన్న ధీరమాళి!
అతుల విజ్ఞాని గాంధి మహాత్ముఁ డెలమి.

చిల్లి గవ్వయు లేక సిడమెత్తి దిక్కుల
రక్షింపఁ దొరకొన్న భిక్షుకుండు
నెట్టనయిష్టమే చట్టం బొనర్చి పా
లించు కిరీటంబు లేని రాజు

జోగెత్తుకొని కీర్తి శుద్ధాంతముల శయ
నింపఁగా మఱెఁగిన నిత్యభోగి
కడుపారనే పూటగంజి లేకయె నిత్య
సంతర్పణము సేయుసదమలుండు
భరత ఖండంపుఁ దులలేవి పార్థివంబు
హస్తపుం గుమ్మెటలపైఁ బ్రశస్త చిత్త
శాంతమున బాడుకొను వృద్ధ జంగమయ్యె
ఘనసముజ్జ్వల వీరుండు గాంధి మహాని.

అగళించినాఁడు దిగంతములనితాంత
శాసనశిఖిశిఖాచయము జిమ్మ
వెదఁజల్లినాఁడు దుర్మదశాత్రవాసిక
దంతి మస్తిష్కముక్తాఫలములు
కురియించినాఁడు దుర్భర దేశ దాస్యంబు
దునుమాడ జాలు నెత్తురుల వాన
విరజిమ్మినాఁడు గభీరుల స్మరణీయ
పుఁజిలుంగుటోర్పు కప్పురపు దుమ్ము
ఎట్టి శుభగడియను జనియించినాఁడొ?
గాని! సృష్ట్యణు వణువు గర్భాన నిండి
వెలుఁగుఁ దొడఁగె జ్ఞానజ్యోతి వివిధగతుల
దీవ్య దజరామ రస్థైర్య తేజ మొంది.

కొన ప్రాణముల తోడ కుమిలి కూలారినన్
బగ్గ దీర్చను బొందినొగ్గినాఁడు
జడిపించు గాడ్పులు సల్లాపమాడినన్
శ్రమకు నెదురో్కలు సలిపి నాఁడు
అహరహంబును దిండి కల్లాడి మాడినన్
స్వాతంత్ర్యము గడింప సాగినాఁడు
రక్త నాళంబుల రాణదగ్గెనె కాని
జ్ఞానంబు వెగఁజల్ల బూనినాఁడు
భరతమాతకు జయగీతి బాడినాఁడు
కుళ్లునుకు వాడ మెఱుగని కొలువు సేయ
త్యాగ మర్పించు కొన్న వదాన్యరాశి
దీర్ఘ శాంతుఁడు మన గాంధి ధీర వరుఁడు.

నాకులరక్షణార్థముఁ బ్రణాళికలే వగ నెత్తి యంటుక్రొం
జీఁకటిబాపి మేడఁ బువ్వుసెజ్జల కూర్కొడు నగ్రజాతులన్
మేకొని మేలుకొల్పి యొక మేల్మియుగంబును బాదుకొల్పినా
యీకడగండ్లదాస్యము జయింపశ్రమించిన పూజ్యుఁడాతఁడే

కూడుమఱచినాఁడు సుఖాలగోరు కొనక
పంచములపాటుఁ గన్నారఁ బాఱఁజూచి
యంటుబాపి స్వాతంత్ర్య భాగ్యంబుఁగూర్చ
వెలసినాఁడు తపముజేసి విసివినాఁడు !

ధర మహాయుగంబులు మేటితపము సేయు
వీలుగానట్టి కార్యదుర్గాల గెలిచి
విజయదుందుభి మ్రోయించు వీరవరుని
కిదె నమస్కృతు లర్పింతు ఋణముదీఱ!

అని యత్యుత్తమగాంధిమహాని యసహాయప్రాజ్యయోగంబుచిం
తన ముక్తి జేయుచుశంభుడంత్యజుల బాధల్ దీర్చి సౌఖ్యంబు బెం
పను నేరేనియు పూరిఘోర కృషిదీర్చన్ ముఖ్యమంచెంచుచున్
తనదౌజీవిత మేతదర్థమున సంధానింపదీక్షన్ గొనెన్,

అంత కంతకు నాంతర్య మందుఁ బాడమి
ముసురు కొనివచ్చు భావాల మోపుదలకు
తట్టుకో లేక బహుళ సంతప్తుఁ డగుచుఁ
జెలఁగి పయనించె నిజకులసేవఁ జేయ.

అది నిశీథిని దేవి నాట్యంబులాడు
జిలుగు కాఁదారి మాఁదారి, వలువు సృష్టి
కన్నుమూసెను, రోదసీగర్భ సీమ
మహిమ నిశ్శబ్ద మైమాటు మణగి యుండె.

కత్తికి వీరపూజలను గాదని శాంతికి గాన్క లిచ్చి క్రొ
న్నెత్తుటి వాఁకలో మునుఁగ నీచపథంబని జింతజేసి పూ
గుత్తుల వీడు కోలులనుగుంద మసంస్కృతి లేమ కిచ్చిక
న్నెత్తి రవంత బిడ్డల గణింపక తన్నిశిసాగినంతటన్

గుండెరాయి జేసికొని నిబ్బరంబున
దారి కొంత నడచు, తన పురంబు
వంకచూచి మరల పరిపరి విధముల
బరితపించు విడిచి యరుగలేక.

మా పెద్దలు బలసమార్జన చెమటతో
ధనము గూరిచిన క్షేత్రంబు లివ్వి
నా పూర్వ పురుషులందరు కూటి కల్లాడి
కనలి దాగిన వల్లకాడు లివ్వి
మా జనాళికి దాస్యమర్మంపు సాములు
నేర్పిన పున్నెంపు నేల లివ్వి
నా జాతి ధర్మమంతయును జెండాడి మా
క్షత నొసంగిన పాళెత గడ్డ లివ్వి
చదువు సంజలమర్మంబు సొంత మెఱిగి
నన్ను గాదని విడనాడి నాయఖండ
భోగములఁ జరించు మదాంధ్రభూములివ్వి
అక్కటా ! యెట్లు విడనాడి యరుగువాడ.

అని కొంతేగును తత్తరించు నిజజాయాపుత్ర సంసారయా
తన బంధంబు లనంతమై హృదయ పద్మప్లావనప్రేమసా
ధనకుల్యంబులు సాగనీయక దురంత క్లాంత చేతస్కుఁడై
కనులఁ నీరు దొలంచు గ్రుంకునొక దుఃఖక్లిన్న భూమిస్థలిఁ.

కనుఱెప్ప తెరలసందున జిందులంద్రొక్కు
వలపు బిడ్డల పోలికల పటంబు
ప్రేమమయ జగాన బీడించు రక్తాభి
మానంపు వాహినీ మహిత శక్తి
ఆంతరంగికసీమ నట్టిటునడ యాడు
సంసార యాతనాసక్తి పీడ
అడుగడ్డునకు సంశయపు దేవి బంధించు
దారావియోగ దుర్దాంతబాధ
జాలి గలిఁగిన యతని హృజ్జగముజుట్టి
కుప్పిగంతులు వేయుచు గూడివచ్చు
భావవిన్యాసముల రుత్త పాటుజేయు
కార్య భగ్నంబొనర్చుచు గదలకుండ.

తన రక్తంబయి పుత్ర రూపమున ముద్రం జెంది నిర్భాగ్యత
న్వనటం జెందు తనూజ కాంతల ముఖప్రాసాద వైక్లబ్యమూ
తని బాధించి దురంత దుష్కృతులతో తప్తంబొనర్పం జివా
లున బ్రేమంపువిమాన మెక్కి ఝులుజేయన్ యాత్రచాలించుచున్.

చేరి మనస్కరింపక వసింపగృహంబున డెందమందుఁ బెం
పారు స్వజాతి రక్షణమహత్తర పౌరుషవాత పోత సం
చార పరాక్రమంబులకు శక్తినిరూఢతఁ గాన్కనిచ్చి నిం
డారుముదాన నాతడుప్రయాణ మొనర్పను సాహసించుచున్.

"మన కులాభ్యుదయోన్నతి మహిమఁగోరి
ప్రాణముల నైన మా రొడ్డ బాలు పడితి,
సరకుగొనకుంటి సంసారసారహీన
తుచ్ఛసుఖముల ధైర్యంబుదులను దూచి.

నాకు నైనీవు దిగులు సందర్భమున గూలి
గడియ యొక్కయుగంబుగా గడప వలదు
వీరపత్నివి పున్నెంపు విరులదాగు
నీతి కింజల్క శోభతో నెగడుమింక.

నీపతివ్రతాధర్మంబు నిఖలభార
తావనికి మేలు బంతియై యలరుభంగి
త్యాగము వెలార్చి పౌరుషస్థాపనమున
వఱలుభరతఖండైక సత్ప్రతిభఁజాటి.

చదువుల నాటితేటి వికసన్నవశక్తి బయల్పడంగఁగా
నెదుగుచు నిబ్బరంబుగురియించు వసంతకుమారి కూఁతు నీ
యదుపునబెంచుచుం మనకులాభ్యుదయోన్నతికై శ్రమింపగా
సదమలవీరవాక్కుల రసంబుల నుగ్గులునూరి పోయుమా.

భారతదేశకాంతల పరాభావపరాక్రమ వీరగాథ సం
చారము సేయుచున్నయది సత్కవిశేఖర కావ్యకాంతకుం
హారతులిచ్చి శాశ్వత నితాంత యశస్సుగడించి ప్రేయసీ!
ఘోరుయదిక్కులందు బరిపూర్ణజయంబును గాంచునంతకుం."

చిత్తమునందుఁ బాదుకొని చిందర వందర చేయుచున్న నా
యుత్త నిగూఢభావనివహప్రతిబంధక బాధలన్ని రే
కెత్తిన ధైర్యపున్ని సిత హేతిబలంబున నుగ్గుజేయఁ దా
నుత్తర మిట్లువ్రాసి తనయుగ్మలి కొంగున గట్టి భక్తితో

పుష్పగంధము గుప్పబోసి బత్తివెలార్చి
కొంగవాల్కత్తికి గొలువుజేసి
రచ్చలోఁ బెద్దయై రాఁబోవు నిజకుల
స్థితిఁ దలంపని తాతచిత్తమెంచి
పసుపు కుంకుమపు ధూపములతోడ నరుంధ
తీ దేవిమాంగల్య దీప్తి కెఱఁగి
శ్రీ దేవి బెంచిన చిన్నబీరమనీదు
శౌర్యప్రభావంబు సన్నుతించి

పరమ పావని మాతంగి పాదపద్మ
ములను ధ్యానించి ముప్పదిమూడు బిరుదు
వీరపద్యములఁ బఠించి భీతిలేని
యాత్రసాగించె శంభుఁ డాయాస మనక.

సమాప్తము.

---

# ద్వితీయాశ్వాసము

---

తూరుపు గొండసానువుల తోయజబాంధవుఁడఝ్జుఁ జూచి ది
వ్యారుణ రాగరథ్యల విహారమొనర్ప నుపక్రమించె ని
ద్రారమ సృష్టిచిత్రి సుఖదంపు టుయేలలఁదాండవించె వి
స్తారకలధ్వనుల్ సలుపసాగె శుకాది శకుంత సంతతుల్.

మలయవాతూలంపు మగవాని కెంగేలు
ముద్దాడ మరఁగె పుష్పాడి మిటారి
కోయిల కొసరింపుఁగూఁతల మాధురీ
శ్రుతుల రాణించె ప్రకృతి వధూటి
క్రొంగ్రొత్త కిరణాల కులుకు బాపల ఠీవి
నిశ్వసించె తమస్వినీ చిరంటి
తూనీగ చిఱుఱెక్క తొంపలి సురటీల
సల్లాపమరసె న షాలతాంగి
తూరుపు జిగిర్చె గిరణకాంతుల పసందు
దిశల నవ్వించె సృష్టిప్రదీప్తిఁ జెందె
వెయ్యి గుఱ్ఱాలస్వారి గావించి పొద్దు
పద్మినీ కేళిదేలంగ బయనమయ్యె.

నిదురను మేల్కొని బిడ్డల
సొదఁదీర్పఁగఁ బొగిలి మగువ శోషిలుచుండన్
పదిగంటల పొద్దెక్కిన
విదితముగాకుండె మగడు వెడలిన జాడల్.

గండభాగంబుఁ గన్నీరు గౌగిలింప
వేదనాదాష్ప భూతంబు వియ్యమొంద
చిత్తము నితాంత దుఃఖాగ్నిచే దహింప
శోకయుగాధ వారాశి వీచికల మునిఁగె.

వినయమునేత్రి పద్మదళవీధులలో నడయాడ జాలితోన్
దనపతిజాడకై పురమునంగల యిండుల వాడవాడల
నొనుగుచు గుమ్మరించుచును గూఁతలవేయుచు వచ్చునెప్పుడో
యని సమయానకై దెసలనారయుచుండెను నంగలార్పుతో.

మగని విపద్దశాధిక సమస్యవితర్కపిశాచి భ్రూకుటీ
ద్విగుణిత విస్ఫులింగ కణవిస్తృత భీకర బంధనంబుచే
వగరుచుఁగంటినీరులను వాపుకొనంగను బైటకొంగుచే
తఁగొనిహతాత్తుగా సరసె తద్దయునాథుని జాబు సాంతమున్

అరసి తదంతరంగమున నట్టిటుగొంచెము జింతజేసినే
దరులగు ముద్దుబిడ్డల కథాపరివర్తన దుఃఖకాండ దు
ర్భర పరిమాణమున్గొలఁతఁ బట్టకధైర్య రసో చితార్థపున్
బురుజులనెక్కె కీరితి చమూ జయభేరుల నిక్వణింపఁగన్.

ఒడలు చలించె నిస్తుల మహోన్నత పౌరుష రక్తవాహినుల్
బాడమి స్రవింపగాఁ దొడఁగె పూనిక రేగి నరంబులందు యి
బ్బడియనురాగమున్మగని పై గురియించి దయారసంబు సం
బరమున జల్లె దీవనపు బచ్చలు దాపిన మేల్మిపల్లకిన్.

కడఁగి నికృష్టమై గవియు గష్టసుఖంబుల జంటమాచి కా
అడవులఁ జెల్మి జేసి చరితార్థినియై జగదేకకీర్తితో
నోడయుని భావదేవత మహోజ్జ్వల సౌధములోఁ జరింపఁగా
నడుగులు వెట్టె దీమసపు టత్తరుజల్లును మైస్రవింపగన్.

బోనము లేదు చేతదిన బొక్కెఁడు, కల్గినదంత లేమి స్వా
ధీనము చేసి భద్రమని తేఁపకు తేఁపకు జెప్పి ఆంధ్రికిన్
బ్రాణపదంపు టూరతుల బంపుచు జేయనిగీర్తిఁ జేసి మో
దాన బ్రియాణమై పురము దాటె నిసుంగులు దేబరింపగన్.

అది ఘోరాగ్నికణంబులన్గురియు మధ్యాహ్నంబు జిట్టాడు తు
మ్మెద సంతానము తమ్మిలో నొదగి యున్మేషింపగా మానె పు
వ్వదళంపుంజెలులోరసిల్లుచును మోముల్ వాంచె దుర్వారశో
కదవాగ్నింబడి కాంతి దప్పెను దిశల్ ఘర్మాబ్ధి నోలాడుచున్.

వేసవికాలరాక్షసి గభీరపరాక్రమవహ్నిఖండ బా
ణాసనధారియై కువలయాంగనతో సమరంబుసల్పి ని
శ్శ్వాసము రేపుచుం బ్రకృతిభాగ్యము సర్వముసంహరించి సిం
హాసనమెక్కెఁ ఠీవి దొలకాడగ నాతపరాజ్యమేలఁగన్

పడమటిగాడ్పు శాత్రవులు బన్నినవాఁడి మయూఖజాలముల్
గడుసుదనాన రువ్వుచు వికారము బ్రాణుల నెమ్మనంబులోఁ
బడిన డయాడ జేయునెడ బాపము శంభుని ధర్మపత్ని కా
అసువుల జొచ్చె డింభకుల మసృ జలంబుల మున్గి తేలఁగన్.

చెమ్మట ముత్తెముల్ శ్రమకు జిక్కిన మైనును క్రొంబసిండిపూ
రెమ్మల నిగ్గుజగ్గుల వరించి ముదంబున జెక్కుటద్దపుల్
గుమ్మములందు నాట్యకళకుం బస దిద్దు ప్రశస్తరోమపుం
దుమ్మెదబాఱు క్రొమ్మెఱుగుతోఁ బరిహాసము లాడునట్లుగన్.

మలల గమించు నాత్మశిశు మార్దవసౌహృద పద్మషండముల్
మలముల కూటికైబోగిలి మార్గ్యాను శోభకుఁదావు లేక లో
యలఁబడి నిర్గమింపనసహాయత పూనికమై జెలంగఁగాఁ
గలఁగుచుఁ దప్పుకోనలవిగాక సరాసరిసాగినంతటన్.

పిడియేన్గుపిండులు ఫెళ్ళు ఫెళ్ళుమని వృ
క్షములచేధించు దొండములచాచి
సింహశార్దూలముల్ జెలఁగిజింకల నల్ల
గ్రోలు నఖంపు బాకులవిదల్చి
గుర్ఘురధ్వనులతో గోరాడుగుహలపై
కోదమపందులు ముస్తెపదనులెఱపి
పుట్టలవెనుకచూపుమెకాలు చెదలు దం
డులబోరుమొండి పట్టుల రగిల్చి

సత్త్వఘీంకృతులకు బ్రతిశబ్ద పూరి
తనినదంబుల నగరాజులనుపు చుండ
భయసమాకీర్ణ దుర్భర పాపియునిపి న
సీమ, గుండె జలదరింపుఁ జేయుచుండె.

కాలువెట్టిన సూదిత్తాల బాణౌఘంబు
లీదులాడును నెత్తురేరులందు
ముక్కుజూపిన గాడుపుతురాయి పిట్టలు
చిందులాడు చెమట చినుకులందు
కన్నులెత్తిన భయంకరవన్యసత్త్వాలు
జూపట్టుచూపు మంజూరులందు
పెదవులెత్తిన పొంచిపెంపొందు దాహేచ్ఛ
విహరించు రసనంపు వీథులందు
ఎండగుత్తాల గడితంపు దండయాత్ర
తట్టు ముట్టాడి గుండెల దమక జేయ
పత్తులై సొక్కి సోలిసాబాలు కుంగి
వెడలు చుండిరి తల్లితోఁ బిల్లలపుడు.

నిప్పుల గాడ్పు పోతలకు నెట్టనత్యాగ మొసంగలేక బె
మ్మెప్పుల బుగ్గిలో సమసిపోయెడి బిడ్డలకై శరణ్యపుం
జప్పర మొండు చూచుకొనఁ జాలకతల్లి విపత్సముద్రపుం
గప్పలిపొత్తు నంగురిసె గన్నుల వెచ్చని నీటిబిందువుల్.

వారి వరించి నిస్తులిత పౌరుషవాక్కుల సందడించి చెం
పారు స్వజాతి రక్షణ మహత్ప్రతిభా విలసత్పతాక ది
వ్యారుణరాగ కాంతులకు హారతులిచ్చుచు సంకటాల వి
స్తారత కుంజలింపక నిదానముగాఁ బయనించు నంతటన్.

ఇగురు జొంపంబుల నేపారుభుజియించి
గోలగోలగ బరిటీలగొట్టి
కొండనెత్తంబు లంగోరాడిధీ గొల్పి
మదజలస్నాన సంపదలఁదోగి
దంతాల సారించి ధారుణిం బెకలించి
చెలరేగి గరిడీల విలువఁజూపి
తొండముల్ నిగిడించి తులకించి ఋక్షవృ
క్షాలపై కెగసి కుస్తీలఁబట్టి
పాదతాడ నోద్ధూత ప్రభాపరిచండ
శోణమృత్తి కారుచి వినిదారిణమంబ
రాంతరమలమ ఘీంకార రవళితోడ
నేన్గుల బిడారు వారల కుదురుపడియె.

ఆయాటోప విజృంభణంబులకు నాయార్భాట ఘీంకార బా
ధాయూధప్రతి బంధకంబులకు యాతాయాత భీతాత్ములై
యాయాసంబునఁ దల్లిబిల్లలు పయోగార్తి పరివాహంబునన్
సాయంబేమియు లేక చెల్లచెదరై శంకించుచెల్లెఁగిరో.

కాల విషభూత చిత్రము ఖానఁగలుఁగు
ప్రతిభ లెవ్వరు నిశ్చయ పరుపగలరు
నిముసము గతించునంతలో నిండి యుబుకు
తత్త్వముల మార్పుదానికీ తరముగాదు.

తల్లివియోగ మారుతము దాకుటఁ చిత్తము దత్తరించి మ
త్తిల్లిప్రభూత బాధలకు దీలి వసంతకుమారి తమ్ముతో
నల్లన దుర్గమాటవుల యందు గమింప నుపక్రమించె చిం
తిల్లుచుఁ గష్టపుందెరల దెప్పల దెబ్బకు నిగ్గజాలమిన్.

దారుణ పర్వతాగ్రముల దాపటశాద్వల సీమలందు సం
చారము జేయుచున్న మృగసర్ప పరస్పర ఘోరభీకరా
కారరవంబులన్ వినుచు గాసిలివేసట మూసఁగా గ్రిదు
ర్వారవిలంభ చిత్త పరివర్తనతోఁ బయనించునంతటన్.

అమితదాహ మొంది యాయాసమున జిక్క
నడువ లేకఁ దారిఁ గడు తపించు
తమ్మునొక్కచెట్టు దట్టంపు నీడల
నిలిపి భగిని వెడలె నీటి కొఱకు.

విపరీతంబగు కాలవర్తన మహావిక్రాంత దుస్తంత్రపుం
దపనంబెంతయు లెక్కసేయక ప్రశాంతం బొంది సర్వస్వదు
ర్విపథంబుల్ బరమేశు చిత్తమనుచున్ వేసారి వేసారి యా
విపినాంతర్గత సీమనొక్క చెలువున్ వీక్షించె మోదంబునన్.

పొందామరపుటిండ్ల భోగించుచలలయు
య్యాలలూగుచునుండు నంచపిండు
గండుచేపల మాంస ఖడంబులను మెక్కి
కేళిమై దిరుగు కొక్కెరల గుంపు
బుద్బుదాల బెడందు ముత్యాల గొడుగుల
నలరారు బుడుగు ముంతల చయంబు
కవుల కలంబుల గౌఁగిటఁ దులకించి
నెయ్యంబు లొలుకు డిండీరపంక్తి
సాంధ్యరాగంపుఁ గ్రీయెండ చప్పరముల
కల కలా రావమాధురీ గానమొలుకు
చిత్ర వైచిత్ర్య పక్షుల చేష్టలరసి
స్వర్గ సుఖభాగ్యమంచు విభ్రాంతిఁ జెందె.

చల్లని నీటితుంపురుల చంకలలో గిలిగింతలాడి సొం
పిల్ల గమించు గాడ్పు పసిబిడ్డ లొసంగు సుఖాల మల్లెపూ
జల్లుల కాన్కతో స్థిరవిశాలము దావహ చిత్తరూఢి సం
ధిల్లఁ జిగిర్చె మానసము దీమసమారె బెను గద్దెయెక్కఁగన్.

ఒకకొంత తత్తటాక
ప్రకటిత సౌందర్య వైభవంబుల దనలో
నకలంకా నందంబున
చకచక వర్ణింపఁ దలఁపుసాగిన యంతన్.

ప్రకృతి రమాప్రభావిమల భాగ్యపరంపర స్నిగ్ధరామణీ
యకముల సంగ్రహించి ప్రణయార్ద్రిక దుఃస్థితి పంకిలంబులో
తికమకలాడు పశ్చిమపు దిక్సతి మోహాపురత్న సాధనీ
మ కీనుఁడు సాగిపోయె బహుమాన మొసంగి రమించుకోరికన్.

పొంచిన క్రొత్తచీఁకటుల పోకిరి కన్నెలకొప్పులందురా
ణించెడి జ్యోతిరింగణవి నిశ్చల దీప్తుల సాయమందితో
పించుచు రేపడంతి నగిషీపని దాపుడు చీరగట్టి సా
గించె మహాధికార బలకేతనమెత్తి జగంబునేలగన్.

పాఁతబడి పోయినసత్కళా భాగ్యములను
గోలుపోయి తపించు భూగోళమెల్ల
చండ్రనిప్పులఁ జిమ్ము విస్తారభూత
ములహుటాహుటితోడ సంకలితమయ్యె.

దిక్కుదరి దోచకున్నయా దీనకన్య
హృదయ పద్మాన రేకెత్తి రేగుచుండు
వేఁడినిట్టూర్పు పవనముల్ విపినసీమ
వృక్షజాతంబులను గాల్చి వ్రేల్చుచుండె.

విధులువరియించి పొదిగింటఁ బెట్టుకొనెడి
తటిని బొదలడ్డమైనను దప్పనగునె?
తన నసీబున దైవంబు దప్పదనుచు
దీర్చిన ఘనాక్షరములె సిద్ధించుఁ గడకు.

ఆ వసంత కుమారి మొఱాలకించి
వలయు సాయంబు లోనఁగూర్చు వారు లేక
తామరపుటాకు దొన్నె నుదకముగొనుచు
తమ్ముకడ కేగు చుండె సత్వరపు నడల.

విచ్చివిచ్చని సన్నవిరజాజిపూవుల
వలపుదెమ్మెరల పరిభాతమహిమ
సంతానకుసుమంపు సౌధాల విహరించు
రక్తాభరాట్సతీ రభస పటిమ
మురిపంపుఁ జలువపందిరులల్లి తచ్ఛాయఁ
గ్రీడించు నేలా సఖీజనంబు
కపరింపుటనటుల కాండ కాండములందు
బరువెత్తు సజ్జికపసదనంబు.
గలిగి యానంద డోలలకమ్మ కూన
రాగముల నగాసుగ బాడుంకర కాల
పక్షిదంపతి జిగిపరువంబుతోడ
గూడికొమరారు నొకవింత కోనఁగనియె.

కనిసంతోషము తన్మయత్వము వితర్క ప్రాభవోపేత భా
వనవైదూర్యవిమాన యానమున తప్తక్లాంతదేహంబు చ
ల్లసిఖండామృతమై వినూతనపు టుల్లాసంబు దీపింపఁగా
జన యత్నించెను కోనసుందరత గాంచన్ భీతి రాపాడగన్.

ఝుఝురుం బూవులమేలు పందిరులలో జ్యోతిష్మతీ దీపపున్
మజసింగారము లల్లిబిల్లిగను సంభావించి యందందు న
క్కజపుం జిత్రవిచిత్రముల్ గుములుగా నైగన్పింప స్వర్లోకమా
నిజమా యియ్యది యంచు సందియము లెన్నేగల్గ నప్పట్టునన్.

ఒక వంకస్ఫటిక మహోజ్జ్వల వేదికా
సింహ పీఠాలు భాసిల్లుచుండు
ఒకచాయ నవరత్న ముకురవిద్యుద్దీప
కళికా వితానంబు కాంతులొలుకు
ఒకచెంత నాజూకు లొలుకునెట్టని పట్టు
జికిలి తివాసీలు చీకిలించు
ఒకయోర నునుగాడుపు కుమారుల పసందు
వీణా నినాదముల్ వెలయుచుండు
ఒక్కయెడ దోచుచంద్రకాంతో పలప్ర
భావితానంబు నేత్రపర్వంబు సేయ
తన్మయత్వము నెంది నిదానముగను
సాగెనట కొంత యవలి ప్రసక్తినరయ.

చెమ్మటముత్యాల జిగిరించి దీర్చిన
మదుకైన భావాల గుస్తరించి
చిటికలో ధారుణీ చిత్రాల గ్రహియించి
తెలివి నూదంటు రాతికి దగిల్చి

అలరు పాత్రౌచిత్యముల దృష్టి దప్పని
కుమ్మర సారెపైఁ గొఱంత లేరి
వలపులు మొలిపించు నులిమొనఁ బరువెత్తు
సిసలైన నగిషీల సేకరించి
శిల్పి కారుల కలమున సిద్ధిఁజెంది
ప్రీతిఁ దనరారు వరశిలా విగ్రహముల
గాంచి యద్భుతంబైన తర్కంబుతోడ
దిగులుపడఁ జొచ్చె వ్యసనంబు దిటవుపడఁగ.

కాఁబోలితఁడు వీరకావ్యాలు గర్భమం
దలరారు బాలచంద్రాధిపుండు
కాఁబోలితఁడు తెల్గు కత్తికి పౌరుష
రసము దాపిన కృష్ణరాయ విభుఁడు.
కాఁబోలితఁడు కీర్తి కాంతల సౌధాలఁ
జిందులాడిన శివాజీప్రభుండు
కాఁబోలితఁడు దేశకళ్యాణములకునై
తనువు నర్పించు పరితాపసింహుఁ
డితడె యోర్గంటి సామ్రాజ్య మేకచక్ర
ముగను బాలించి వైరుల మొండెములను
కంచు బురుజులమీఁదఁ గట్టించి మించి
తేజరిల్లిన ఘనకాకతీయ నృపుఁడు.

తనవిజ్ఞాన మరంద బిందువులమధ్యఁ దాండవంబాడుచ
ల్లనిప్రేమ ప్రసవైక గంధముల లీలావజ్ర సౌధాలవా
సినిగోసంగుల రక్షకై యిడిన కాశీనాథ నాగేశ్వరా
యని బింబంబిది యాజుమీ! సుగుణచిహ్న శ్రేణి గన్పట్టెడిన్.

శత్రుల బావిలోపల విగాహితమై గడితంపు రాజ్యసం
పత్తుల కాలవాహినుల బాకులకుంబలి యిచ్చి రీవితో
బెత్తుగడించి స్వర్గసుఖ వీచికలన్ దనరారు రెడ్డి భూ
భృత్తులు వీరెయంచు దలఁపింతును గీరితి సంస్మరించుచున్.

దీవ్యదఖండ భావముల దీప్తుల రంగుల సొంపునింపుచున్
గావ్యనిశాంత భిత్తికల కల్పిత చిత్రవిచిత్ర పాత్రలన్
భావ్యముగా రచించి ప్రతిభన్ జగమం దలరారు చుండు నా
భవ్య కవిత్రయాది బుధవర్యుల చొక్కపు విగ్రహాలివే.

అతడు వేమనయోగియని యనుకొందును
దివ్యతత్త్వాల బోధించినాఁడు
అతడు నేసుక్రీస్తుఁ డనుకొందుఁ బరులకై
సిలువపై రక్తంబు జిందినాఁడు
అతడు బుద్ధుండంచు ననుకొందు గడునహిం
సాధర్మ సూక్తుల జల్లినాఁడు
అతడువివేకా నందుఁడను కొందు సీమలో
భరతఖండఖ్యాతి నెఱపినాఁడు

అతడు రామకృష్ణ పరమహంసాగ్రగణ్యుఁ
డితడు ప్రథిత విద్యారణ్యుఁడే నిజంబు
భక్తులగు వీరిపాదాల పరిచరించు
భాగ్యము లభించె జన్మంబు భద్రమయ్యె.

పాటియై తగువపు ప్రాభవంబున దొడ్డ
కళ లుట్టిపడఁగ రంజిలు బుధుండు
పరదుర్లభ సమగ్రభాగ్య రేఖలెసంగు
కనుదామరల నొప్పు ఘనగుణుండు
క్షితినెల్లఁ దుృటిని వశీకృతిఁ గావించు
వదనగాంభీర్యంబు వరలుపొృడ
హరికి నగ్బరుకట్లు నందంబు బెంపొందు
పుట్టుమచ్చ గలుఁగు పుణ్యమూర్తి
మాటమాటకు గొండంత పాటివిలువ
గలుఁగువక్తల "గండర గండబిరుదు"
కట్టమంచి వంశాబ్ధిరాకా విధుండు
రామలింగయరెడ్డి విగ్రహముగాదె?

అస్పృశ్యతా మృత్యు వాస్యంబునను జిక్కు-
స్వజనుల యాతనల్ సైపఁజాల!
అంతకుమూలమా నగ్రవర్ణులు దయా
పరులు! వారలఁ దప్పు వట్టఁజాల!

నెన్ని కల్పముల కే నీ విషాద సమస్య
దృష్టిమై దీఱు నంచెంచఁజాల!
నలువది కోట్లు జనమ్ముఁ గాదని పాల
కులు యుద్ధరింత్రని తలఁపఁజాల!
ననుచు హృదయమ్ము పచ్చిపుండై వగర్చి
చేయి చెక్కిటనిడి కురిచీని వ్రాలు
సుకవిశేఖర బిరుదుండు జోసపుకవి
చంద్రు విగ్రహ మెదుర సాక్షాత్కరించు.

ప్రబల భక్తి కర్పూర నీరాజనముల
నర్పణ మొనర్చి కన్నీట నలవటించి
వారి గుణముల ముదమార బ్రస్తుతించి
చెంగటను నొక్కమాని పతంగుఁ జూచె.

చూచుచు సమీపమున కేగి సొఱగి యొరఁగి
దండములు వెట్టి యక్కోన దద్దరిల్ల
పెద్దపెట్టున నేడ్చె నాపేద కన్నె
ముఖము నవలోకనము జేసి మునివరుండు.

"అబలా! యెవ్వరిదాన వీవు కతమేమైయుండు నేకాకివై
బ్రబలారణ్య నదీనదాది భయదప్రాంతంబులఁ జాటి యీ
గుబురుంగోనకు జేరవచ్చుటకు? నీకుం జుట్ట పక్కాలు లే
ర? బిడెంబుఁ విడి జెప్పవమ్మ" యని పల్కఁ వేఁడి
నిట్టూర్పుతో.

వచ్చి నెత్తురు తిండి భక్షించి పరునింట
దాస్యబంధాలలోఁ దాండవించి
వల్లకాడు కడాని వజ్రాల పందిళ్ళఁ
గొఱవి దయ్యాలతో గొలువుఁదీఱి
కూడు గుడ్డయు లేక కొంప నీడయు లేక
పెద్దమ్మ పొదుగింట ముద్దులాడి
అంత యనువు లేని కొండకోనలయందుఁ
గన్నీటి పగఱతో గదనమాడి
మాతృదేశాభ్యుదయ గీత మాలికలను
భక్తి వీణా నినాదాన బాడుకొంచు
వీరి యన్నిటను బహిష్కరింపఁబడిన
పంచమ కులాన బుట్టిన బాలనాడు.

కులము సముద్ధరింపఁగల గోరిక నాజనకుండు శివి మై
కొలఁది దినాల క్రింద నెటకో జనె నంతట నాదు తల్లి వ్యా
కులపడి మమ్ము వెంటఁగొని గొందలమందుచు దుర్గమాటవీ
స్థలుల గమించుచుండు నెడ సంకట మొక్కటి తారసిల్లగన్.

అదురంత విప్లవపు టాయాసకతన
ప్రబలతర వియోగంబు సంప్రాప్తమగుట
తల్లి కొకదారి మాకొక దారి యయ్యె
భావిజీవిత మేరీతి వరలఁగలదొ?

అని వచియించి సొమ్మసిలి నంత నె మ్మానికి గుండెనీరమై
వనరుచుఁ జెంత కేఁగి పలుభంగుల శాంతి సపర్యలఁ బాన
ర్చిన యొక కొంత నిబ్బరము జెందను బిడ్డకు గోస్తనీ ఫలా
లను గొనియిచ్చి క్షుత్తును బలాయన మొందఁగ జేసె ప్రేముడిన్.

దిగులు గణింపఁ బోకు సుమతీ! పరమార్థము వెల్లడించెదన్
తెఁగువయుఁ త్యాగముఁ బ్రబల తేజము గల్గి రవంత యేనియున్
బెగడక యేనరుండు పృథివీస్థలియందు బరాక్రమించునో
బొగడికతో నతండె బహుభోగము లందును శాశ్వతంబుగన్.

తల్లి గర్భమునుండి తరలిన తొలిపూట
జన్మ మెవరొసంగి సాకినారో ?
కన్నుఁ దెరలఁ జిమ్మి గదలు చూడ్కులకు స్వా
గతమిడి యెవ్వారు గాచినారో ?
క్షుత్పిపాసల బాధ కొఱకు చెమ్మటలోడ్చి
ప్రేమించి యెవరు దీవించినారో?
బొమ్మరిండుల యందు బుజ్జియాటల నాడ
నేర్పించి యెవరు మన్నించి నారో?
అతిదయా వంతమై యేడ్చునట్టి నీదు
కులము కొఱకు ప్రతిక్రియ గ్రుమ్మరింప
వలదె? కర్తవ్య శేషంబు బాకి లేదె?
ప్రీతిఁ దనువుతోఁ బ్రాణమర్పింపఁ దగదె?

చే వెంట నడువంగ జిన్ననాఁటను నేర్చి
రక్షించి యెవడు ధైర్యం బొసంగె
ప్రబల పరిశ్రమా ఫలితంబుఁ దినఁబెట్టి
చేయెత్తి యెవ్వఁ డాశీర్వదించె
కఠిన బాధల నెత్తిరిగాఁగింటఁ బ్రేమించి
కులికించి యెవడు బూగుత్తులొసఁగె
శీతా తపాదుల సిలుగు దొంతర లందు
బోషించి యెవడు ప్రబోధ మొసఁగె
ఉదిత మెఱిగించి భావంపు టుగ్గుదాపి
తనరు కోమల హృదయాద్భుత స్వరూప
ముల వెలింగించి నట్టి నీ కులమహోప
కారిని దలంపవా యేమి భారమనక.

అరయ నిరంతర జ్వలితమై తగు దుఃఖపు టగ్నియందు దు
ర్భరభయ కీర్ణమైన రణరంగము నందు స్వకీయు లెందరో
నిరశన దీక్షతోఁ గనుల నీరులురాల్చి తపించు చుండఁగా
పిరికి తనాననీ వనుల బేరము బట్టుట న్యాయమే సుతా.

నీచ జనులందు దనరారు నిందలజ్జ
ప్రేమతత్వ రహస్యాది ప్రేరణములు
నీకు పరిచితమై యున్న నీకులంబు
లెట్లు భావ్యభివృద్ధితో నింపు గులుకు.

పెనఁగులాడు స్వార్థత్యాగ పీడవీడి
ప్రేమ శీతామృతంబును విరియఁజిమ్మి
నీ కులంబు వెలార్చు కన్నీటి మంచు
దెరలఁ దొలగింపఁ గోరు ముత్తేజమొంది.

సద్గుణ సాహస సత్య శూరత, శాంతి
పౌరుష ప్రతిభా ప్రభావమహిమ
పాలనక్షమతా విశాల భావస్ఫూర్తి
ప్రీతి కారుణ్య గంభీరపరత
శుచితా మనస్వితా సూక్ష్మమేధామనో
నిర్భయతా భక్తి నీతిపటిమ
వినయతోదారత విశదలోకోత్తర
ప్రభుతా మహోన్నత ప్రాభవాది
గుణగణములఁ బ్రభుడు నీకుకోరి యొసఁగి
పరులకార్యాల కుపయోగ పఱుపుమన్న
శాసనముదప్పి నావు! సంశయము జెంది
అందు రాజన్మ మెత్తుట వ్యర్థముగను.

అట్టి విశ్వాస ఘాతుకమైన కార్య
జాలముల జేయప్రభుఁడు విచారపడఁడె?
నీ చరిత్రకు జయము సంధిల్ల గలదె?
శుభము లేరీతి వరియించి సొబగుగూర్చు.

స్వీయకులజులు సతము విశేషదుఃఖ
సాగరాంతర మగ్నులై శక్తి లేక
నలిగి త్రాహి త్రాహి యటంచు నార్తినొంది
యడలుచున్నారు శరణభిక్షార్థులగుచు.

ఏనిష్ఠురుని మీఁద నెంతేని కారుణ్య
తైలంపు టారతిఁ దనిపి నావె?
ఏదరిద్రుని మీఁదనేని దయార్ద్రస
త్కుసుమ వర్షంబుల గురిసి నావె?
ఏయభాగ్యుని మీఁదనేని కన్నీటి ప
న్నీటి దీవనల మన్నించి నావె!
ఏపేదవాండ్రపైనేని నింపెసలార
ప్రేమగంధంబు గుప్పించి నావె!
వీనులెపుడైన వినియెనా! పేదమొఱలు!
శాంతిసమ కూర్చెనా నీదు సదుపదేశ
చంద్రికాజ్యోతి నిస్తుల శాసనంబు
కరుణగీతాలు శ్రుతి జిహ్వికను నటింప.

ఈ ప్రపంచంబు మర్త్యుల కెల్లముఖ్య
మగుపరీక్షా స్థలంబిలను గనబడెడి
దుఃఖవుం బ్రశ్నల మితంబు దొరలుచుండు
బుద్ధివైకల్య మెంతేని పోతరింప

కాని స్వాత్వ తేజోమయ జ్ఞాననిధులు!
ఘనులు వీనిని గుర్తింపఁ గలిఁగి యువిర
శసహజోజ్జ్వల మేధాబలాన పరీక్ష
ములను సాధించి జయమును బొందగలరు?

ఇదియే శాశ్వత కీర్తిదాయకమునై యేపారు దేవత్వ భా
స్వదఖండాది ఫలప్రదంబులను నాపాదించి కళ్యాణసం
పద దిగ్దేశపు సీమలందునిడి సమ్యక్ప్రీతిఁగల్పింపఁగా
బదిలంబై గనుపట్టు, దీనికిసమానంబెందు లేదిద్ధరన్

స్వార్థతంత్రంబులెడ బుద్ధి సాగనీక
సమయభాగ్యంబు వృథఁబుచ్చ జాగుజేసి
లోకకళ్యాణ దాయివినై కడింది
జీవనముచేయు శక్తి బుంజీభవించి.

దుఃఖకాండములందు దొడ్డయిల్లాలివై
వ్యాధులందున వెజ్జురాలవగుచు!
ఘోరవిపత్తుల గొమరొప్ప జెలివౌచు
దీనతకాశ్రయ దీపమవయి!
అతి నిరాశా నదమం దోడవును నయి
శోకాదిదశలందు జ్యోతివగుచు!
బోరలుకష్టాలలో ప్రోయాలివై సంది
యంబుల దృఢనిశ్చయంబుగలిఁగి

భయము నంద చంచల ధైర్య భావము గొని
జనిత విశ్వాస కర్మల సరకు గొనుచు
ధ్యాన భాషణ శ్రవణము లందుఁ గడగి
వాస మొనరింపఁ గావలె బాలనీవు.

జీవనరణము నందు సుశ్రీవహించి
విజయ వంతురాలవగుచు, వేడ్కనత్య
శాంత దుఃఖ విశృంఖల కాంతియందు
పాసనకు బూని నిష్ఠతోఁ బ్రబలు మబల.

వసుధనీయాత్మశక్తులపై నితాంత
నిశ్చయంబు ప్రసాదించి నిష్కళంక
హృదయ పుష్పంబు విప్పి పరిమళింప
జేసి జాగ్రత్తగ మెలంగి వాసిఁ గాంచు.

అంధ కారంబునందు శశాంకు వోలె
భయము నందున ధ్రువతార భంగిరాణ
మెలగి పరదుఃఖముల బాప గలిగిశ్లాఘ
నీయమగు చరితలకు తావీయ వలయు.

ప్రబలు నీ నామమేకైక భావశుద్ధి
తో స్తుతించుచు మేలు కొందురు ముదమున
నపుడు కర్తవ్య క్షేమంబు లన్ని కుదుటఁ
బడును నిలుచు సత్కీర్తి సర్వత్ర నిజము.

న్యాయ సంస్థాపనార్థ మనారతంబు
ప్రాణముల బోవు నంతకుఁ బట్టు దలను
వదలగా లేక ధీరులు ప్రతిభఁ జాటి
చెలఁగి దిక్కుల వణకింపఁ జేయుచుంద్రు.

సుకము ప్రాప్తించుటకు దుఃఖమొకట కార్య
కారియై చెల రేగి వికాసముగను
పూని సద్గుణాది వరాల కాన్కలనిపి
సంతసము గూర్చు నుత్తమ స్థానమొసగి.

తీవ్రపరితాప దైన్యగీతికలరవము
లెక్కడెక్కడ వినెదవో యక్కజముగ
అక్కడకు నెల్ల జని నిర్భయతను జాటి
యాప్తులను బ్రోవవమ్మ ముందంజ వైచి.

కుచ్చితులు నీచులుత్తమ కులము వార
లతికురూపులు సుందరు లాదియైన
వారిపై ప్రేమ శాసనభావ భాగ్య
మహిమ సమమేగదా ? యసామాన్య భంగి.

ప్రకృతి వైచిత్ర్య సౌందర్య భావకళల
జింతనము జేయు కవిరీతి, స్వాంతమునకు
నిముసమెడవోని గట్టి పూనికను బట్టి
శ్రమలరాపిడి దీర్చు మాజంకుపీడి.

క్షీపణా భ్రమమునఁబడి ప్రేలువార
లీయనంత ప్రపంచంబు మాయయందు !
కాని యదివట్టి కల్ల ! జగన్నియంత
యిష్టమున గల్గె నీవిశ్వ సృష్టి యెల్ల.

గమిసి పరికింప నిదియొక కర్మభూమి
కుమిలి మోసంబులను జిక్కుకొనుట ; యొకట
పరమ కర్మచ్యుతులగుచు భంగపడుట
గలుఁగు ; మానవ జీవిత క్రమమునందు.

ఒక యనంతశక్తి తన మహోచ్ఛ్రితమొయి
జనన పాలన లయముల సలుప గడఁగి
భూమిని భ్రమింపఁజేయుచుఁ బోతరించి
భయము గల్పించుచున్నది పరికరింప.

తతమహా శూన్యమును జీల్చి దారుణంపుఁ
గేతువును బయల్పఱచిన క్లిష్టతమున
సుందర సుధార సాబ్ధులానంద మొలికి
భంగ సంఘాలతోడ నుప్పొంగ గలిఁగె.

అమ్మహాశక్తిని గురించి యహరహంబు
కర్మమే యాచరింపంగఁ గడఁగవలయు!
ప్రగతులన్నియు దాననే బయలుదేఱి
నియమితములయ్యె బహుభంగి నిక్కువముగ.

అట్టిశక్తి పరిభావంబునందు మనుజఁ
డెంత? పరమాణువు! తదర్థ మెఱిఁగి జ్ఞాన
సిద్ధితో వీరులకొలువు జేయుమాత్మ
కులము రక్షింప వజ్రాలకుండె నొడ్డి.

ఏ కులము జనన మిచ్చి యాడించి పా
లించినిను ముదాన బెంచుకొనెనొ ?
ఏ గడ్డ స్వాగతం బిచ్చి వీర కథల
బద్దెంబులఁ బఠింప దిద్దుకొనెనొ ?
ఏ యనారోగ్యంపు టెంతికౌఁగింటిలో
జీవిత శేషంబు చిక్కబడెనొ ?
ఏదేశ పవనంబు లిగురెత్తిజ్ఞాన పు
ష్పబహూకృతులతోడసాకు కొనెనొ !
అట్టి నీకులరక్షణ కైసమస్త
శక్తు లుపయోగపఱచుట సంప్రదాయ
మగును, ఋణవిముక్తియు గల్గు ఘనయశంబు
శాశ్వతస్థాయి యగుచు నీజగము నిండు.

నీ శాసనంబులు నిఖిలదిక్కుల యందు
జయ జయ ధ్వానముల్ సలుపుగాత!
నీ విక్రమస్థిరనీతి కిం జల్కముల్
లేఁబ్రాయమున గుబాళించు గాత!

నీ మేటిభోగట్ట నిక్కంపు టసమును
మొలిపించి పలపించి కులుకు గాత!
నీ కంటుమెడజుట్టు నీచంపు చట్టముల్
పూర్తిగా నశియించి పోవుగాత!
భరత ఖండంబును స్థిరభక్తి నీవు
సింహపీఠికపై నధిష్ఠించి దెలుపు
నీయఖిల శాసనముల మన్నించి యాల
కించి సేసఁబ్రాలను గురియించుగాత!

అని దీవించిన మహానివర్యు భువనాహ్లాద ప్రబోధంబులఁ
వినియుత్తే జపరాకప్రమాదులుబుకఁ వీడ్కొలునుంబొంది త
మ్మునిదాహేచ్ఛను బాపియాత్మకులముఁ బ్రోవంగ నూహించిద
బ్బునమున్నాశ్రమముఁ గమించెఁ బ్రమదంబుల్ జుట్టిరేకెత్తఁగఁ

ప్రాకటకార్యభారములపై మనసుంచి యనాథబాల పెం
జీకటి యాటపాక తెఱఁజీల్చి నిసర్గ పరాక్రమంబుచే
ఢీకొనితమ్మ తావుకుగడించి ప్రియా సలతోడ నీరముఁ
జేకొనిపోయెఁనాతడట జిక్కకయుండుట తత్తరించుచుఁ

తిమ్మఁడను పేరనొప్పారు తమ్మకొరకు
గొంతురాపిడి జెందవ్యాకులత తోడ
పెద్దపెట్టున నేడ్చుచు బిలిచి బిలిచి
వాని వెదకుచు నడవులు పట్టిపోయె.

సోదరి యెట్టులో జనియె శోకవిఘూర్ణిత మానసంబుచే
గాదిలితంబు రాజపురిక్ష్మాపతియై తగురామకృష్ణు స
త్పాదము లాశ్రయించి పరిపక్వ వినమ్రిత బూజచేయు సం
పాదనతోడ విద్యగఱుపంగను బూనె తదేక దీక్షతో.



# తృతీయాశ్వాసము

---

నాఁడు వియోగ ఘోరకదనాన రచించిన దుఃఖగీతులం
బాడుచుఁ బెట్టుగాయిడి ప్రభంజన బాధల కోర్వలేక త
చ్చాడుచుఁ బల్లెపల్లియల సందుల గొందులఁ బాఱఁజూచుచ
ల్లాడిన ముద్దుబిడ్డల విలాసపుజాడలఁ దల్లిగానమిన్.

కనబడు వారినందఱ నెగాదిగజూచి వినమ్రశాంతి భా
వన బహుమానమిచ్చి కనువంకల దైన్యము జిందువాఱఁగా
వనులవియోగమై శ్రమలపాలగు బిడ్డల నొక్కఁడైననుం
గనబడిరాయటంచడుగు గాళ్లకు మ్రొక్కును జాలిపుట్టగన్.

మెదుకు రవంత యేని దినమెచ్చదు నిద్దుర కన్ను దమ్ములం
గుటురక సౌఖ్యపుంగొలువుకూటము సేయను బాపదోయి బెన్
బదవలజెంది మొత్తుకొను, స్వాంతమునం దిగులెత్తి పెంపుతో
నెదుగుస్వకీయ సంస్కృతి విహీనపుమార్పులు వన్నెఁబెట్టుచున్

ఆపె ప్రశాంతమైన వదనాంచలసీమల విస్ఫురించు సం
తాప నికృష్ట దుర్భరకథా పరివర్తన వీతిహోత్ర జ్వా
లాపటిమ ప్రభావ వికలత్వశిలీముఖ ధాళధళ్యముల్
వ్యాపకమయ్యెసృష్టి మరియాదకు భంగము చెంగలింపగన్.

క్రమ్మిన కష్టమేఘములు గార్చు కవోష్ణపు టశ్రుతోయబృం
దమ్ములు వాకలై జలధి నాయకు నిర్ణయభాగధేయ మా
ర్గమ్ముల వ్రిక్కలించి నిజగర్వపరాక్రమ శౌర్యగాథ భా
గ్యమ్ముల వెల్లడించెఁ గలకాలము నావెడు సంస్మరింపఁగన్.

తిరమై మిక్కుటమై చలించు తన పుత్రీ పుత్ర సంతాన దు
ర్భర నిస్తంద్రి వియోగ తాపభరసంప్రాప్తంబు దైన్యంబుతో
వివరింపం దొరకొన్న కారణకథా విక్షోభపఙ్కంబు మున్
గరుణాసాంద్రుల మానసాబ్జముల వీకన్ జీల్చె నొక్కుమ్మడిన్.

పరుగుగాడ్పుపటాణి స్వారిపైఁ బుత్తెంచు
తలపుఁడింభకుల సంధానపఱచి
పరువంపుఁగిరణాల భటులతో బుత్తెంచు
దృష్టివాగురుల సంతుష్టిపఱచి
ప్రబలహృదయ శోక పరకీయుతో బంపు
నశ్రూదకపుజాబు ననువుపఱచి
గడియతీరిక లేని కరుణతో బంపించు
సంగిలారుపు గాన్కలమరఁ జేసి
అరయఁగా నెంతబిడ్డల, నరయ లేని
యీ కథావిధానంబు సహేతుకముగ
కానబడనట్టి మగనిక్కై గాకితోడ
కదురయమ్మున గన్నిటి కబురునంపె

వాఁగుల వంకలన్ గిరుల వన్యలలో బరికించి దుఃఖపుం
గౌఁగిట బుత్రలబ్ధి ధనకాంక్ష వరాల సరాల గోరుచు
న్నోఁ గిరమెట్టిదో యెఱుఁగకుండ తపంబుల రాటపాకులో
మూఁగి చికాకుముండ్ల పొదపొత్తున దాపము వెల్లడించెడిన్.

అట్టిటుదొంగిచూచి దనయాదనయాయని దేవులాడుచుం
బెట్టునగొంతురాయగను బిల్చును, గుండెలు గ్రుద్దుకొంచు నిం
కెట్టునఁగాంతు నేదరుల నీవసుధాస్థలియంచు స్వర్గసా
మ్రాట్టుని వైపరీత్యగుణ మర్మవిభేదము జింత జేసెడిన్.

తిరిగితిరిగి కడకుతిప్పల నెన్నియో
కుడిచి వగలబొంది కూఁతుఁగొడుకుఁ
గాన లేక, దిగులుకడలిలోఁ గన్నీటి
దెప్పలందు మునిఁగి తేలుచుండె.

దినములు గొన్ని దాటి చనుదెంచె, సరాసరి పుత్రశోకపున్
వ్వనధితరంగ ఫేనరవపంక్తులదాటి యొకింత తగ్గి సాం
త్వనము పరిమళించె, దినబత్తెముకోసము సంతపించుచున్
బనుకులఁ జూడయత్నముల బన్నఁదలంచెను నంతటంతటన్.

అంటులుగట్టి రేగు కురులందలి చింపిరి తుట్టెగుళ్లలోఁ
దుంటరి పేలదండు తులదూఁగుచు నెత్తురు తేనె ద్రావుచున్
గెంటసలాడుచు న్నరుజు కేకల స్తోత్రవిపంచి నాదపున్
గంటవిహాయసంబున షికారుల జేయును నిర్భయంబునన్.

కడుపుఁజూపించును గన్నీరురాల్చును
బేరముగానొకముద్దఁ బెట్టుఁడనును
ఇంటింటకరుదెంచు నేడ్చును క్షుద్బాధ
మాన్పుఁడంచును బతిమాలుచుండు
ఛీ! పొమ్మటంచును చీదరించుకొనిన
గోజాతిమంగింట గొణుగుచుండు
నేఁటికి మూన్నాళ్లు నీరమన్నము లేని
పాపలసాదకొంత బాపుఁడనును
కర్మసంచితమున గలిగినకష్టాల
జడలదయ్యమునకు జలదరించి
వెక్కి వెక్కి యేడ్చు గుక్కిలుమ్రింగుచు
పిల్లదండుతోడ వల్లపడక

కట్టుచప్పుడుసాయాన కబళమునకు
దిరుగుప్రతిరాత్రియును గొంగుదేవురించి
గవిసిపసిబట్టి కుక్కలు కాండ్రుకాండ్రు
మనుచు బైకి లంఘించు గోపాగ్నిగురిసి.

పాపమునిమ్మ కష్టముల భారముగాంచగలేనిదాట, దీ
నౌపరతంత్రుఁడాప్తుఁడొకచాలిననెమ్మది రైతుబిడ్డతా
నామెనుజేరదీసి దినమన్నము బెట్టుచు గొడ్లకాపుకై
ప్రోపకమిచ్చె, జాలిపడి బాలురతోఁ దనయింట నుండగన్.

కానియాతని యర్ధాంగి కఠినహృదయ
కడఁగి యెంగిలిచేతిలోఁ గాకినైన
తఱిమి యెఱుఁగదు తనజీవితంబునందు
చూపుజూచిన నెత్తురుపోన గురియు!

వేగురుజుక్క పొడిచిఁ గనుపించినతోడనె నిద్రలేచి యెం
తే గృహకృత్య జాలములనెల్ల నిమేషము వారగాని యే
జాగును గానిలేక కొనసాగఁగఁ జేయును రైతురాణిచే
నాగడిపేదరాలు వినయంబున బొందెను శాసనంబులన్.

విస్తృతంబైన బానిస వృత్తి రాక్ష
సీ కరాళ నిశాత నిస్సీమ దంత
యుగ్మపు ఘరట్టముల మధ్య నుక్కివమున
జిక్కుకొని నిమ్మ తబ్బిబ్బు జెందసాగె.

కొక్కొరోకోయటంచును గోళ్ళుగూయ
కయ మునుపు, బొడ్డు గొండల గద్దెపైని
దీప్తి జెన్నారుచును, ప్రాక్సతీవియోగ
దుఃస్థితు లినుఁడందక తుళ్ళి తూగుసరికి.

కసవుల నూడ్చి యూడ్చి పరగడ్పునఁ గోఁతకొ? మేతకో యెటో
విసువకయేగివేళకు నివేశము, జేరును భిస్సటాన్నమున్
మెసవును గొడ్లదోలుకొని మేపుటకై పొలిమేరభూమికిన్
నిసువులతో గమించును గణింపఁగ రాని భయంబు పెంపునన్

అలసటతోడ మాపుకడలందున నింటికిజేరవచ్చి ని
స్తుల పరితాప భారములతో నెలుగెత్తియు నేడ్చుచున్న బి
డ్డల కడుబుజ్జగించుచు హుటూ హుటి దూకెడిస్వామిపత్నియా
జ్ఞల నెఱవేర్చు కష్టమను శంక రవంతయు నంకిలింపకన్

అది యస్పృశ్యులస్త్రీ, కులీనులకు దయ్యంబౌచుఁ గన్పట్టు స
మ్మద భాగ్యాధిక సామరస్యమట కేమాత్రింబు రానీక మూ
ర్ఖదవాగ్నిన్ వెలివాడలో బుధుల శిక్షాశాసనం బంది పె
ద్దది యైనట్టిది, మేల దెట్టుగలుఁగుఁన్ దమ్మాభి సంస్థాస్థలిన్

దినకృత్యంబులలో వృథావ్యవధి సుంతే గల్గినన్గైన చె
ప్పునదండించును, నోగిరంబిడదు, నిప్పుల్ గ్రక్కు కోపాగ్ని గుం
భనచే మాడ్చును, బండ్లునూరి దురభిప్రాయంబు లెన్నేని క
ల్పనమున్ జేయును, రోషభాషలను నాలంబించు గర్వంబుతో.

నిమ్మి నిమ్మెను నుండి రక్తమ్ము లబికి
చిత్తజల్లులకై వడి జిందుచున్న
గడియు తీరిక లేని చీకాకు తోడ
పశువులను మేప వనులకు బఱచుచుండు!

కాననసీమలందు వడగాడువు దంపు పరాక్రమించి భూ
మీ నవఖండ లాద్యఖిల మేదురవస్తు చయంబులెల్ల స్వా
ధీనము జేసి మించి వితత దిస్రుత ఘర్మజలాధికప్రభా
ధీనములోనగల్పుకొనె దివ్యదఖండ జయాంకశోభలన్

మండుదవాగ్ని లోనబడి మాడితపించెడి బాలబాలికా
మండలమార్త నాదముల మ్రగ్గుచు రేగెడి ఘోరతాపపుం
గుండములో గుబాలుమని కూలుచు నాల్కలుచాచిచాచిబ్ర
హ్మాండ విదాహ దుఃఖవశమై దురపిల్లుచునుండె నెంతయో.

గేదెలమూక లట్టిటులఁ గ్రొళ్ళుఱుకుం మిడిచెంగనాలతో
ఖాదము మేయ, వెంటబడిగాచనఁ నిమ్మ్రగమించు పాపమా
నేదలు లొక్కటై నిలువనేరక తల్లిని వెంబడింపఁగా
బోదురు, కంటకావృతసముద్ధతకుంజము నిర్గమించుచుం.

పశువులనాపలేక నొకవంకసరాసరి, వెంటనంటు త
చ్ఛిశువుల నార్తనాదముల ఛిద్రపరంపర నాలకింపఁగా
విసువు జనించి రెంటఁబడి విశ్లదకర్దమ కూపరాశిలో
నసువుల నప్పగించుటకునై తలయొగ్గెను గుండెనీరమై.

ఆకలియాఁచునున్నదనియట్టిటు, నొక్కఁడు బర్వులెత్తుచు
న్గేకలువెట్టు నింకొకఁడు నీరముదెమ్మనిబైటకొంగు నుం
బీకును; పోదమింటికని బిట్టుగలాగుచు నొక్కఁకుఱ్ఱడ
ఱ్ఱాఁకలువెట్టు! నిట్టిస్థితియుండు సవిత్రియెట్టు లుండునో.

చంద్రుడనిప్పులు గురియించు స్వామిపత్ని
చండశాసనోద్దండ నిశ్శ్వాసమునకు
దిశలు వేసారి వత్తులై తెలివిదప్పి
యశ్రుపూరిత సందేశమంపుకొనియె.

గాడుపుశాత్రివుల్ గబళించునొకసారి
క్రొంగ్రొత్త నెత్తుటికూడు మెసవ
ఉడుకు దుమ్ముల సెజ్జబడగుంజునొకసారి
చిక్కనచియ్యల వ్రక్కలింప
సూర్యాతపంబులు సుర్కించునొకసారి
మలినదేహములు చెమ్మటలుబట్ట
పంచభూతంబులు పైఁబడునొకసారి
తమతమభాగముల్ దాగ్రహింప
ఒకటసింహశార్దూలాది ప్రకటకలుష
సత్త్వసంఘాతభయదగర్జారవముల
వినుచుతబ్బిబ్బుఁజెందుచు భీతిజెందు
బిడ్డలకుధైర్యగాథ విపులపఱచు.

పొద్దుకడలందు నిలుజేరు, రోషగించి
గృహిణిశాసించు సర్వసాంకేతికంపు
కార్యబృందంబులన్నియుఁ గష్టమనక
నిర్వహించును జాగు సుంతేనిలేక.

మురికి చారలు బొలయు నాబోటి మేను
కెరలుకండూతి శింఘాణ కిల్బిషముల
చే నితాంత దుర్గంధ నిశ్శ్రీకమగుచు
జుమ్మటంచు జోరీగలుగ్రమ్మచుండె.

దినమొకరక్తబిందువు గతింపఁగఁజొచ్చె, నరాలగుండవె
చ్చనివోగమంచు గాడుపులుసాగె, బలంబులుసన్నగిల్లె తీ
రనిపరితాపభారము స్థిరత్వముదాల్చె, ప్రశాంతతేజపుం
గుణనిధు లస్తమించెననుకూలత తగ్గుచునాఁడునాటికిన్.

రైతుపట్టంపురాణి పరాక్రమాది
శాసనామ్నాయములకు నిసర్గపూజ
నముల భక్తితాత్పర్య సంతర్పణముల
నాచరించుచునుండె గష్టాంతరమున.

ఊలిన దేహవల్లరుల యుచ్చులలోపల ప్రాణకీరబృం
దాలను, జిక్కపట్టి, ప్రమదంబున బాసట లేకపోయినన్
బాలురతోనొకానొకట బాకముదప్పినగుండెలో నిరుల్
మూలుగువన్యభూములకు బోయెను గేదెలు మేపుకోసమై.

పసులనొకపల్లమందున బండజేసి
బిడ్డలనుముందు గూర్చుండబెట్టుకొనుచు
బుజ్జగించుచు నేమేమొ ముచ్చటించు
పట్టునందున నదిదాటె పసులగుంపు.

కడఁగి చల్లని వల్లంపు గాలివీచె
యబ్బురమ్ముగ చేటంత మబ్బుబట్టి
వాఁకలును చెర్వు లేకమై పాఱునట్లు
గురియఁ జొచ్చెను జడివాన గుబ్బటిలుచు.

అంతఁ దటాలునంబనుల నారసి, లేమిక గుంది, తన్నదీ
ప్రాంతము జూచి,యావలకుఁబారెనటంచు గ్రహించి వెంటవా
రంతట వత్తురం చెఱుఁగి నందఱ జెట్టున గట్టిబెట్టిపైఁ
జింతను దాలెఁదన్నదిని శీఘ్రమె! బిడ్డలు గోల జేయఁగన్.

ఖగ సంచయంబు లాకాశ వీథులనుండి
కోటాన గోట్లుగా గూలుచుండె!
వృక్ష వితానముల్ లక్షోపలక్షలు
ఫెళ్లు ఫెళ్లుమటంచు విరుగుచుండె!
గృహలు గోపురములు చెడిగుబాలున గూలి
ముక్కలు ముక్కలై పోవుచుండె!
వన్యసత్వంబులు వరద దెబ్బల పైని
యమలోక యాత్రల కరుగు చుండె!
సృష్టి విపరీత భంగిగా విష్టపమున
పరిణమించెను, బ్రహ్మాండ భాండమెల్లఁ
బ్రళయరుద్రుని గోపాగ్నిఁ బగిలినట్లు
కుండపోతగ వర్షంబు గురియఁజొచ్చె.

ఆపెను వానపోతకు దిశాంతరసీములు కందువాఱి సం
తాపము వెల్లడించెను, ప్రతాపము దప్పెను తమ్మివిందు, దా
దాపుగ హీనమై ప్రకృతి దాగెను, బంధుర కాళరాత్రిలో
వ్యాపన మయ్యెదయ్యముల వారిత విక్రమవహ్నిఁజిమ్ముచున్.

దూరమేగిన పశువుల దోలుకొనియు
వచ్చుపాటికి తన్నది వరద లేచి
భీషణ ధ్వానములతోడ బెల్లుబుకుచుఁ
బారుచుండెను గట్టులపైనఁ బొంగి!

దాటశక్యంబుగాదు, నద్దరిన వణకు
చున్న యమ్మాయటంచును గలమటించు
కుఱ్ఱల మొగంబు వీక్షించి గుండెవీలి
జ్ఞాపకము దప్పిపడిపోయె మాటపోయె!

ఆకట సోలుచుఁ బుడుతలందరు క్రొంజలి గాన్ఫుటితిచే
గేకలు బెట్టుచు న్బొగిలి క్రియ్యుచు, నట్టిటు తల్లిఁగాంచనై
దూకులు వెట్టు నీవల ప్రతున్న పుటాత్రిని గొంతురాయగా
వాకొనుతల్లి పోకడల వైఖరిగాంచియు బిడ్డలేకతఁ.

కప్పలు బాములుఁ గుములుగా నిరుప్రక్కల దండుదీరి పె
న్మ్రప్పుల బెట్టుచుంగఱువ బోవుచు నట్టిటు మీద దూకుచుఁ
నిప్పుల గ్రక్కుచుండె, నిలనేరము, గుండెలు వ్రీలసాగె, మా
కప్పురపాటు దీఱవడిగాఁ జనుదేఱగ దమ్మ తల్లిరో.

అని దుఃఖాంతవచో విలాపముల నా హ్వానించి గోజాతి నే
లను దొర్లాడుచు కాకిగోలగను నాలాపించు చల్లాడి వె
చ్చని నిట్టూర్పులు బుచ్చు బాలకుల విస్తార ప్రమాదాల జృం
భణ కుం గుండెలు బ్రద్దలై కరగి బ్వాం జొచ్చె మిన్నేటితో.

అయ్యది ప్రచండమైన నట్టడవి నేల
భయదమృగ గర్జలేగాని పలుకుతోడు
మానవ స్నేహమచట సంప్రాప్తిగాదు !
పసిని నుంగుల కెఱయిక పొసఁగ కుండె.

ఆవల బిల్లకాయలటు లార్తినిబ్రుంగు మహావ్యథాభరం
బీవల బుత్రలబ్ధికొఱకేచి సహింపని మాతృదేవి దు
ర్భావపు దైన్యజాతకము వ్రాసెడికాల కవీంద్రుగంటమం
దేవిధి మారునో యకట! యెవ్వరెఱుంగుదు రీరహస్యముల్.

అంతట నెవ్విధంబులనొ? యాముడులన్నిటిఁదప్పఁదన్నిగ
ల్లంతుగనేడ్చి తాళనికళంకముదల్లినిడాయఁగోరి ర
వ్వంతయు సంశయింపక స్రవంతిని దాఁకియు క్రిందుమీఁదలై
చింత మునుంగుచుం బరము జేరిరి తల్లిని సంస్మరించుచున్.

కన్న పుత్రకు లొక్కట కన్నులెదుట
కాలవాహినీ ఘోర భంగములఁజిక్కి
కూలిపోవుట తల్లికి గుండెబగిలి
దైవపదసీమయందు జిత్తంబునిలిపె.

గాలిని ధూళినింగలిపి కాయముగా నమరించియందు నీ
పోలికనిల్పి మానవుని భూమిసృజించుట యబ్బురంబె! గా
నీ! లయ దుఃఖభారముల నిష్కృతియేలకొ దానివెంటనే
కాలివసింప వ్రాసితివి తద్దయు దుర్దశ బొందరక్షకా.

ఏయడవులు బట్టెనో యాత్మనాథుండు
పెక్కువత్సరములు వెడలిపోయె
సదయాంతరంగ వసంతకుమారినా
మురిపెంపు సుతదారి యెఱుఁగరాదు
కన్నులు దెఱచిలోకమ్మెఱుంగనికుఱ్ఱ
తిమ్మఁడేమయ్యెనో దెలియరాదు
నిలువనీడయు లేదు తలపైన గడుపుపై
కొండంతచీఁకటి నిండుకొనియె
చావునకుదప్పు నిసుగుల సైపలేక
జలసమాధినిగూర్చితే జలరుహాభవ
నాల్గువదనంబు లెనిమిది నయనములను
నిండువిసమున్న వేల్పువు నీవొకఁడవె?

కలకాలం బెవరేని ధాత్రిని మనంగానేర రీకడ్పుకో
తలకన్ నిల్వను, నీదులోకమును సందర్శింతు నస్పృశ్యతా
జ్వాలనంబుండక యున్ననీజగము సర్వస్వంబు నూటాడి వ్రి
క్కలుగా మోదెద! నిన్నునీదు హితులన్ గగ్గోలుగావించెదన్.

బాలచంద్రుని గేలు బాలుండు లేఁడు ప
ద్మను బోల్వసంతకుమారి లేరె
అడరిన యొకపూరి గుడిసెబుణముదీఱె
మగడులేక జగంబె మాటుమణఁగె

తలనీడ దొలఁగె బిడ్డలకునై యునియుంటి,
నందఱనిపొట్ట నణచి తిప్పుకు
నిఱుపేదరాల నన్నెము పున్నె మెఱుఁగని
పరమపాతివ్రత్య వ్రతనిరతను
ఆడది యటంచు కూర్మి మైనరుగ లేని
వాడవకట నీవు సృజించు ప్రజలకె మేము
దూరమైయుండగానీకు దూరమగుట
వింతయే ధాత! మావ్రాత పెద్దరోత.

వారువీరనక సర్వప్రాణి కలుషముల్
గడకు గంగ జనించు కర్మభూమి
ఆకొని యేతెంచు నతిథి శ్రీవిష్ణుగా
నాదరింపఁగల పుణ్యాములసీమ
మఱియుహింసారూఢి పరమధర్మంబంచు
జగతికిజాటు విశాలధరణి
మతసహనంబు దైవతగుణంబని వేయి
నోళులబలుకు వాచాలశీల
భూతదయకెల్లఁ దొల్లిటి పుట్టినిల్లు
పరమ పావననామ మీభరతసీమ
జననమొంది యు జన్మించు దినమునుండి
యంటు మమ్మెట్టు లంటెనో యంబుజభవ.

అని యారీతి మదిఁ దహించు సుతశోకాయాస సంతప్తయై
వనజాతాసను పైనభారమిడుచుఁ వాపోయి వాపోయి యా
త్రి నిజాధీశ్వరి రైతురాణి తనజ్ఞప్తిఁ దోపగా పిడ్గులుఁ
దనపై వ్రాలినయట్లుమూర్ఛమునిఁగెఁ ధాత్రీస్థలిఁ వ్రాలుచుఁ.

ఈశ్వరుని పక్షపాతానకిట్లు పొగిలి
తతనదీదేవి గర్భాన దాచిసుతుల
నదిని దాటుచు మూడవనాఁటిరేయి
కొంపఁజేరెను బసవుల గుర్తులేక.

ప్రళయ కాలాబ్దగర్భముఁ జీల్చుకొనిరాలు
పిడుగు మొత్తములఁ రాసిడులమించి
జీవన్మహాగ్ని శైలావతీర్ణోగ్రగం
ధకలోహాపృధు శిలాద్రవముమించి
అ ప్రతి హతముగా నచలాగ్రమున నుండి
క్షితికిజారెడు గండశిలలుమించి
కలితశతఘ్నీముఖంబున వెలిదూకు
భీప్రదాయః పిండవితతిమించి
పండ్లు పటపట గొఱకుచు పశువు లేవి
చూపుమనుచు గర్జించి త్రాచు లోకవేయి
వదనమున వ్రేలఁగట్టిన పగిదిమండి
మిట్టిమీనై పడుచునిమ్మఁ గొట్టెగృహిణి.

ముప్పురిపగ్గాన మొగరాన బంధించి
యినుప సంకెలల దృష్టిని రగిల్చి
చిలుప చిలుపనెత్త్రు చిల్లున వర్షింప
ములుగోల మొనలతోఁ బొడిచిబొడిచి
నెమ్మేను చర్మంబు నెఱియలు వాయంగ
నేలనీడ్పించి బంధాలగూల్చి
పలుగురాలుల వేఁడివాదర నురికించి
ప్రేపబెత్తాలతో వ్రేల్చివ్రేల్చి
నిముసనిముసంబు నకును గణింపరాని
దుర్భరక్లాంత రథ్యాప్రతోళియందు
నెత్తురు లరొంపిఁబడ ద్రోచి మొత్తుకొనఁగ
నీడిపించుట నిమ్మసహింపలేక.

దిక్కుదెసయు లేని దీనురాలగదమ్మ
యేటిపొట్ట సుతులఁ జాటుజేసి
కడుపు గాలియున్న కడుబీదరాలను
కనికరింపుఁ డనుచుఁ గాళ్ళ మ్రొక్కు.

నేఁటికిమూఁడు నాళ్ళకట! నీరము నన్నము లేకపోవుటన్
గాటికి నన్నురమ్మనుచు గాపరి మొన్ననె జాబువ్రాసె నా
రాటముతోడ మీ శ్రమల ఢాకకు దేహముదూదిపింజయై
కాటుకబట్టుచున్నయది కావుముతప్పుల చూడబోకుమీ.

జరిగినతప్పు గాదనను స్వామిని కాలము పోతరించియు
క్కరుణనితాంత విప్లవము గాఁగిటిలో దురపిల్లఁజేసె యె
వ్వరువిధి కృత్య భారములవార్ధితరింప గలారలివ్వసుం
ధర దయతోఁ బ్రమాదముల దాటుచు దప్పుల సైపుమమ్మరో.

కలవృత్తాంతముదైవ్య భావమునవకాణించి పాదాంబుజం
బులపైవ్రాలి నమస్కరించి దుగదంబుజ్ గుఁగికన్నీటివాఁ
కలదోగాడుచు విన్నవించినను దుష్యాపత్య భావాన శి
శులపాల్జేసెను ద్వేషరాద్రిముల వాచాళిలి వర్షించుచుజ్.

జాలియెఱుగని హృదయముల్ శైలగుహాలు!
కరుణయెఱుఁగని చిత్తమింగలపుఁగోవి!
మగువలైనను, మగలైన-మాన్యమైన
దయగలుఁగువారె హో! దైవతములుధాత్రి

స మా ప్త ము .

---

# చతుర్థాశ్వాసము



మునివరు హితోపదేశం
బునువిని' యుద్రేకభరితభూమార్భటితో
వినుత వసంతకుమారిక
తనకులరక్షకుగడంగె దద్దయుదీక్షన్

కష్టములకోర్చి చెమ్మటగార్చియోర్చి
విసిగివేసారి దేశాలవెంటఁదిరిగి
స్వీయకులజుల రక్షింపఁజెలఁగియలసి
సభలఁజేయుంచిరేఁగితత్సభలయందు

కరముపశ్రాంతమానస వికాస పరాక్రమశౌర్య కీర్తుల
న్గరియుచు, స్వీయమూర్ఖజనగుప్తనిగూఢదురంతవిప్లవాం
తరములవెల్లడించుచు వినాశనకారణ మూలనూత్రము
న్గరపదొడంగె రేగిన ఘనాఘనగర్జనుబోలువాక్కులన్

నాలుగుజాతులేగలవనాదిని వేదచతుష్టయంబునుం
బాలనసేయు, స్వార్థులగు పండితబృందము రేగి వేద భా
గాలసహస్రఖండములు గాఁబరివర్తనజేసినేఁటికిం
దేలిచినారు పంచములనేయొక జాతిని దుష్కృతంబుగన్

పంచమజాతిహీనమని భాష్యమువ్రాయఁగజిత్తగించియుం
కించినయాకవీంద్రుని నికృష్టపుగంటములోపలన్ చలా
యించినభావనా విషసహేతుక కీలలవైపరీత్యమే
ముంచెనుమాలమాదిగలఁ బూర్ణముగాదరిలేనిలోయలన్

ఆవులరంగులెన్ని గతులైపెనుపొందినపాలయందు భే
దావసరంబుగల్గ! దటులైనరులెన్ని తెగల్ రవాంచినన్
భావము తత్వమున్ సుగుణవారము లొక్కటిగావె? కొందఱీ
భావము మాటుజేసి మనపై పిడుగుల్ గురియింతు రక్కటా.

లేనిపోనట్టి సాకులనూనిపూని
నాలగవ జాతినుండి యన్యాయరీతి
నాడు మనలను విడదీసినారుసామ
రస్యభావబంధాలఁ బరాకుజేసి.

దారలై తాముసమస్త సౌఖ్యములసంతోషింప నూహించి దు
ర్భర దాస్య ప్రతిబంధ సంతతుల సంభావించి శీర్షాన మో
పిరి యేదోయొక యంటుదోసపు మహావృక్షంబు నుర్వీస్థలిన్
వరలన్ జేసి, పురంబులోపల వసింపంజెల్ల దంచాడుచున్

కానిమరేమి కారణముగానగరాదుఁ కుబుద్ధులెందఱో
పూనికమైఁ బురాకృతము బొందకతప్ప దటంచు బల్కుదీ
క్షా నియమాగ్నిలోఁ దనువుగాల్చుచు నుండిరి దైవదృష్టిలో
మానవు లందరొక్కటియె? మర్మమెఱింగిన లేవు భేదముల్.

నెత్తిన శోచనీయమగు నిష్ఠురదుష్కృత పర్వతాలమో
పెత్తిర కారణంబులగు యీర్ష్య యునీసను శృంఖలాలచే
యొత్తిడిజేసి, తక్కినవి యున్నతజాతు లటన్న పెంపుతో
బెత్తనమందుచున్న యవిప్రేముడి నిక్కపుసమ్మె పెంపునన్,

కాలము దూలిపోయినది గాని, శరణ్యము నేటికైన రాఁ
జాలకయుండె, యింకగనజాలము బత్తిన గడ్డవీడిపో
జాలక యున్న కారణ పుశక్తులె మామకజాతకంబులన్
గాలిచి పిప్పిజేయుటకు గన్నులవిప్పె భయంకరార్భటిన్.

పిరికితనంబు, మందమతి, పేదతనంబు రజస్తమోగుణ
స్ఫురణదురాగ్రహాంబనృతసూక్త్యపనిందలు, క్రూరకృత్యముల్
పరిచయమైన దుఃస్థితుల భారముచే వెలివాడలందు దు
ర్భరవిషతప్తగాథలకు బందులమై మనుచుంటి మాత్రితో.

ఇంతకు సామరస్యమన నెట్టిదో? యెట్లు గ్రహించి దానితో
సంతసమందగాదగు ప్రసన్నత భాగ్యమదెట్టిదోయనే
చింతయె మామకప్రజల జేరక వేసటఁ గూర్చు లోటుపా
టెంతయు ముందుదీర్చుకొను టేపరమావధి నిక్కువంబుగన్.

జ్ఞానవివేక మైక్యగుణ చంద్రికలందునఁ సంచరింపఁగా
బూనినవిద్య నేర్వవలె ముందుగ లోగడ నీచకార్య సం
ధానము మానివేయవలె, ధర్మపథంబులపూల పందిటన్
బ్రాణము గుప్పబోయవలె, భాగ్యము గూరును శాశ్వతంబుగన్.

తరములు కొన్నిమారినవిదార్కొనిమౌర్ఖ్యముదాండవింపఁగా
మఱిగి మఱింకమానుటదిమాతరమాయని పిచ్చిపిచ్చియు
త్తరములొసఁగఁగాఁ దగదు ధారుణిమర్త్యులు దీర్ప లేని దు
ర్భరమగు కార్యముల్ గలవె? రాష్ట్రపై శ్రమఁ జక్కఁ జేసినన్.

కల్లు సారాయి గంజాయి కైపు వలన
యుడుకు నెత్తురు తేజంబు లడగి సమసి
సోమరి తనంబు నరముల గ్రమ్ముచుండు!
కంపమూలంబునై, లేమి కౌఁగిలింప.

బానిస వృత్తిలంపటుల బంజర మందు ననాదినుండి యెం
తే నియమంబుతోఁ జెమట నెత్తురు జల్లులజింది జింది ని
ద్రాణకనుంటి మింకఁ బరతంత్రపు వృత్తుల నేఁటి కైననున్
మాని స్వతంత్ర జీవన సమస్యకు దారులు ద్రొక్కఁగావలెన్.

పంచమజాతి నీచమని బాసట లేమిన దూఱివేఱు జే
యించిరి యేయుగంబుననొ? యిప్పటికేనియు దారిజూపశం
కించుచు విస్ఫురించు ధనకీర్తులు మామకరక్తముల్ చలా
యించి జనించి పెంపగునవేగద! సౌఖ్యము జౌకులెత్తగన్.

ఎంతశ్రమించి చెమ్మట జయించిన భారత భూమి భాగ్య వి
శ్రాంతి విభావసుండు మనచాకిరి మోముల బుట్టికీర్తి వృ
త్తాంతకథా విధానముల వ్యాపనజేసిన యగ్రజాతి ర
వ్వంతయు జాలిజూపదను భావపరంపర తాండవించెడిన్.

కారణ మేమటంచు నడుగ దగధర్మమె! తదరిహాస్య వి
స్తారము వెల్లడించెద, విచారము ? శాంతి దయామయాత్మ సం
భారపుదివ్య దృష్టి మనపైగురియించిన, వారి కార్యముల్
దీరవటన్న నొక్క మిష దేల్చిరి మెట్టికి మూగపట్టుతో.

జీవహింసలు బచరింపఁజెల్లదనుచు
బుద్ధదేవుండు శాసించెఁ బూర్వమందు
నవి విదేశాలయందుఁ బ్రఖ్యాతిజెందె
గాని మన దేశమున గుర్తుగాన బడదు.

క్షామ డామర పీడలు జగమునిండి
క్షుత్పిపాసాగ్ని జృంభించి చుట్టుకొనిన
గాని శవమాంస భక్షణ కాదుచేయు
ఘనత నశియించి మిగుల రోగములఁ గూర్చు.

ఉదికినవస్త్రముల్ దొడమహోన్నతిఁ గూర్చును,నిత్యతానముల్
విదితబలంపు జ్ఞానములవృద్ధికి తావళమై జెలంగుచుకా
సదమలకీర్తిలోకమున స్థాయియొనర్చును, చల్దితిండి చె
ల్లదు, గృహపారిశుద్ధ్యము విలాసము గూర్చు ననేకరీతులకా.

సదమలారోగ్య భాగ్యంబు చాలకున్న
వానిదరిజేర రెవ్వరు, గానిముందె
నీచులము మన; మారోగ్యనిర్ణయంబు
నైన గణియింప కున్న సౌఖ్యంబులేదు.

కలరా స్ఫోటక మాదిగాగలుఁగు రోగశ్రేణి పుట్టొందుచు
న్నలుకుం బూవుల తేరుపైబయనమైఁ గ్రొంగ్రొత్త తేజంబుతో
దళమాపయ్యెద కుంకుమాగరులు సంధానించి యేతెంచు దుః
ఖల విత్రాదులచే వధింప మనదుర్గంధంపు గేహాలకున్.

కుక్కలు దేళ్లు కొక్కులును గూబలు నల్లులు చీరపోతులుం
బక్కన నవ్వుచుం దనరు బ్రాయపు బాముల తేరిస్వారిపై
యెక్కసలాడు చుండుమన యిండుల దుఃస్థితి వైపరీత్యముల్
రక్కసికొంప లేగద? పరాజయసిద్ధికి తావళంబులై.

మలినపు గాడ్పు బిడ్డల చమత్కృతి నాట్యవిశేష నృత్య గీ
తులు, బలితంపు మాక్షిక వధూవరసంగర రామణీయకం
బులగతి భేదముల్ కుములుముంగిటి లేవడి కంటినీటి ధా
రలుశుభ చిహ్నముల్ మనకు రాయిడిగూరిచి పెంపుజేయగన్.

ప్రథమమున మనోవాక్కాయ పారిశుద్ధ్య
తయును ముఖ్యంబు శుభ్రత దైవతాగు
ణంబని వచింతు! రది లేని నరులు నరులె?
స్వల్పయత్నంబుచే దానిఁ బడయఁగలము.

స్థిరదీక్షారతి నూని యత్నము నొనర్పన్ సాధ్యముల్ గాని దు
ర్భరకార్యంబులు గల్గ! వందఱ మవార్యవ్యూహాన్మై చిత్తముల్
మఱుగున్ జేయక సాహసింపవలె నామాటల్ వృథాగావు! మీ
స్థిరయత్నంబున గార్యముల్ విజయముల్ దీపించు నిక్కమ్ముగన్.

ఎవరోవచ్చి సమస్తముఁ సలుపరంచే లా కృశింపఁ మహో
త్సవమంచీ యవకాశముఁ గాని ప్రయత్నంబుఁ బొనర్పుండునే
దువిశేషమ్మగ గూడఁ బోనివని కూడుఁ జేపు! భాస్వంతముఁ
దివముంబో లెవిపత్తులుఁ దొలగుదై వేచ్ఛల్ వృథా మోఘముల్

అకట రాజకీయముగ నాధ్యాత్మికముగ
సాంఘికంబుగ ప్రబల సాంస్కారికముగ
ననుభవించు నమానుషమైనకష్ట
పాటుదలపోయ గుండెలు బ్రద్దలగును.

మనవిషాద ప్రమాద గాథను సమగ్ర
పటిమతో నిరూపించి నిష్పక్షపాత
ముగను వసుధపై వెదఁజల్లఁ బూనుకొన్న
కవి యొకండైన లేఁడెట్టి కర్మమొక్కొ?

సరగ సామాన్యమనుజుల సంక్రమించి
గవియు సహజంపు హక్కులుగాని, వృద్ధి
బొందుటకు వీళ్లుగాని యానందమేని
గాని, సాహాయ్య సంపత్తి గాని, గలుఁగు.

నన్న మేటి యాశాజ్యోతి యార్పివేయ
బడిమొఁగడకు నాశాలేశభావి ఫలము
లందుకొనఁబోము నరకాన గుందువ్రాత
మనకుదప్పదు భువి విమర్శనము సేయ

మానవసమాజ భూరిసంపత్తులందు
సంఘములపరిణామస్థితి సామరస్య
భావములవృద్ధి బొందించు భాగ్యగరిమ
భారతీయులచేతిలో, బాదుకొనియె

నేడువృద్ధిలోనుండి గణింపబడుచు
తనరుస్వాతంత్ర్య సారస్వతంబుచేత
కులుకుభారత దేశంబు క్రొత్తమూస
యందుబోయు మహానైతికాదిశక్తు
ల ననుకూల పర్చుకొనుట లాభకరము

మన నసీబులోగీతలు మంచివైయొ
కంటభావ్యభివృద్ధి పరిణామశక్తు
లంకురించిన, నవిసాంత మగులువఱకు
నిదురబోరు కులీనుల నీచమతులు.

వార సత్వంపు హక్కులీ భరతఖండ
మం దనాది కాలము నుండి జెంది యుండి
భయద భూతాలగానైన బరిగణింప
బడక యుండుట కడుపులో బాకుపోటు.

కత్తిచేనైన వ్రణము వేగముగ మాను
నటుల వాగ్రూపకవ్రణంబణగ దెపుడు
గా యమొక వేళ మానును గాని దాని
మచ్చమాత్ర మెప్పటికైన మాయబోదు.

పాయక భేక సర్ప శవవాయస మాంసము మెక్కువారలన్
ధ్యేయము లటంచు చేర్చుకొని ధీరతగా నొక బావి నీటితో
హాయిని జెందుచుండ మన కక్కడ స్థానము లేక యుంటకే
దో యొక కారణంబెగద ? దుఃఖదవానల మోకరింపగన్.

శ్రిద్ధగా విద్య నార్జించి సామరస్య
భావ రజ్జువులందు సంబంధ మహిమఁ
దేజరిలఁ జేసి, భారత దేశనాయ
కాళితో ఢీకొనవలె సత్యాగ్రహమున.

అప్పటి కైన దేశమున యందు స్వతంత్రత తాండవించి పెన్
ముప్పుల కుప్పగాలిపటముల్ దల క్రిందుగ మారునేమొ? మీ
రిప్పటి నుండియైన విజయేచ్ఛకు స్థానమొసంగ ధైర్యపున్
నిప్పుల బాణముల్ గురియ నెట్టన త్యాగము నభ్యసింపుడీ?

దోసిళు లొగ్గి దండమని దుఃఖ ముఖంబున బ్రార్థనంబులన్
జేసిన, బందుచా కిరులసే దరిదప్పదు, అంటు దోసమే
వీసముగాని తప్పదు, నవీనయుగాన స్వతంత్ర భాగ్యపున్
వాసి వరింపగా వెఱచు ! వ్యర్థమె జీవిత శేషమిమ్మెయిన్.

లెందు జయధ్వజాల నడవింపుడు, దుర్భర బాహువిక్రమో
ద్దండ భయంకర ప్రళయ తామస భేరుల నిక్వణించి భూ
మండల మందు మీదురభి మానపువాస్య విశృంఖలాంబులన్
తుండెలు జేయ, బట్టుదలతో సమరాన కపక్రమింపుడీ

అనుచు వసంత కుమారిక
ఘనత రవాక్కుల ప్రసంగ గంభీరతతో
వెనుకంజ లేకనూరూ
రును దిరుగదొడగెఁ నితాంతరోషస్ఫూర్తిన్

జనకుండాప్తుఁడు శంభు నామకుఁడు విస్తార ప్రభాటోప కీ
ర్తిని దిగ్దేశములందు నిల్పుకొని శాంతిన్ జెందె స్వర్గాన, నా
తని సత్సేవలు దెల్పగా గులజు లంతన్ గుంది చంద్రోపలం
బున జెక్కించిరి శాసనంబొకటి సొంపున్ జ్ఞాపకార్థంబుగన్.

"సాక్షాత్తు పరమాత్మ సాక్షిగా సమదృష్టి
భావాల దిక్కుల బంపినాఁడు
అవమాన దుఖంబులను మాత్ర మంచును
హృదయ సీమను చలా యించినాడు
ప్రాణంబులను దీయ బాల్పడ నెంతేని
వినయ భాగ్యము సమర్పించినాఁడు
దొరలు గష్టాలకు దోహదం బొసఁగుచు
సిసలైన త్యాగంబు జిమ్మినాఁడు
పేద జనముల కన్నీటి వేదనమున
కుమిలి కూలారి తప్తమై కులము కొఱకు
ప్రాణ దానంబు జేసిన భవ్యమూర్తి
పంచముడు 'శంభు' డను పేర బరగు వాఁడు.

పలువిధంబుల కష్టాలబడుచుకడకు
తాను గమియించు పథమునగానబడిన
దోసములనీటు మాపగాదారకొని నవ
హాత్మజీవితచరితమే యవనినిలుచు.

అనివార్యయించిన గుర్తుపద్యముల నేత్రానందమై పుత్రియుఁ
గని, పారాయణదీక్షలో నబికి కంగారైన చిత్తంబువె
చ్చనికన్నీరుల వర్షపాతములచే, చైతన్య దిగ్భ్రాంతిఁజెం
దెను, మూర్ఛిల్లెనఁ తండ్రిగాఁదలఁచె సందేహంబుపోనాడుచుఁ.

ఏలోకాన మతెన్ని జన్మలకు తండ్రీ? భారతక్షోణిలో
నీలావణ్య విశేషశౌర్యపటిమా నిస్తంద్రతేజంబునే
నాలోకించియనంత సౌఖ్యముల యుయ్యాళ్లందు గ్రీడింపఁగా
కాలంబెప్పుడు నాకుగల్గునో మనఃకంజంబు విప్పారగఁ

భౌతికదేహారక్తముల బంధము నేఁటికవెన్నిపాయలై
భూతలమందు వ్యాప్తిమయి బ్రుంగెనో? రేణువులై నభంబులో
వాతకిశోరక ప్రికరబాంధవ వజ్రనిశాంతసీమలో
భూతములై విషాదమున మ్రొగ్గితపించుచునుండెనోగదా!

పాపముపుణ్యమేమనక పట్టినతట్టుకు నాసబట్టి సం
తాప భయాగ్నిలోవిడచి తప్పులుగాఁ బొనరించు మృత్యువుదు
శ్శాపభరంబుదప్పు కొనజాలరు ధీరులుతత్త్వవేత్తలా
భూపులు, దరిద్రహాస్యములమూలమెఱుంగుట సాధ్యమేయగుఁ.

హృదయమే లేని భరతమహీతలమున
తనవులెత్తుట మొదలిటితప్పిదంబు!
పిదప కుమతులు సమకూర్చు బెట్టిదముల
తలచివనరుట రెండవతప్పిదంబు.

ఒకనిబ్రతుకున కింకొకఁడోర్వలేని
కడుపుమంటలకార్చిచ్చు గడలుకొనఁగ
భుగభుగధ్వానములతోడ భువనగోళ
మట్టెప్రేలుచునుండె భయంకరముగ.

వలదింకన్ బడికోట్లజన్మముల కీపాపిష్ఠమహాభారత
స్థలిఁబుట్టొందగ! నీసమాధి నలుపార్శ్వంబుల్ వెలుంగొందఁగా
గలచేవంగనునట్టితో గజికనై కన్నీటిముత్తెంపు జ
ల్లులునీపైగురియుంపనుందు జనకాలోకైక విఖ్యాతిగన్.

అకటా! పేదలయస్థిపంజరపు సౌధాగ్రాలసౌఖ్యాన మా
మక రక్తాన్నములారగించుచును, సమ్యగ్గర్వసంఛన్నతన్
సకలప్రజ్ఞల వీరకాంతలకుశశ్వత్కీర్తిధామాలవా
రకనర్పించు మదాంధ్రభూభువన ప్రారబ్ధంబు లాశ్చర్యమా.

అనుచుచింతించి విలపించు నవసరమున
తల్లి చెరసాల సీమకుతరలుచుండె
రాజభటుల పటాటోపభాజనమున
ముక్కుచును మూల్గుచును స్రుక్కివ్రక్కలగుచు.

పితృసమాధిఁబూజించి సేవించియశ్రు
జలములనురాల్చి యట్టిటుచనఁగఁ గాళ్లు
రానియావసంతకుమారి ప్రబలదుఃఖ
వార్థిమగ్నమైయెట్టులో బరగెకడకు.

తనసదుద్దేశ్యమును మార్చుకొనఁగలేక
శ్రమలరాపిడి పాటించి జంకుపడక
యబ్బురంబుగ సేవజేయంగఁదొడఁగె
ప్రాణములపైని గలయాస మానివేసి

దుర్మదాంధులు గొందఱు త్రుళ్లమాఁగి
లేనిపోనినేరాలఁగల్పితముజేసి
మాతకడకు వసంతకుమారిఁగూడ
వెడలగొట్టిరి చెరసాల వెతలగుంద.

కాలగతి భేదముననాఁడు కాననమునఁ
బాసిపోయిన తిమ్మడు వాసిమెరసి
హేమచంద్ర పురాధి మహేంద్రు సంస్థ
న్యాయమునుదీర్చు నధికారి యై చెలంగె!

కొలువునను సింహపీఠి పై మొలకనవ్వు
గలిఁగి కూర్చున్న న్యాయాధికారి చరణ
సన్నిధికిని తేఁబడిరి విచారణార్థ
మక్కయును దల్లి యొక సమయంబునందు.

న్యాయ శాసనపద్ధతు లరసియరసి
తీర్పుఁ జేయంగఁ దొడఁగెను, దీనులగుచు
నుత్తరంబిడు వారల చిత్త వృత్తి
భావ వైపరీత్యంబును బరికరించి.

ఇదిమాయక్క, మదంబయిద్ది యని యెంతేపూర్వ పుంబోలికన్
మదికిం దట్టెను, రాజశాసనపు ధర్మశ్రేణిఁ బాటింపఁగా
విదితంబెంతయు గాదలంచి మదిలో వేసారివేసారి గుం
డెదడన్ దల్లడమందగా మొదలు బెట్టెఁ వేఁడి నిట్టూర్పుతో.

పొరలి వచ్చెడి దుఃఖంపుఁదెరలనాప
తరము గాకుండె వారి ప్రత్యక్షమందు
నేడ్వఁగా లేక చాటునకేగి యేడ్చి
మఱలి వచ్చును తత్సభా మధ్యమునకు.

మరల దీర్పునకొగ్గును; బొరలివచ్చు
దుఃఖమును నాపలేక దుందుడుకు జెందు
గాద్గదికము నఁబ్రబల్చించు, గలముబూని
వ్రాయఁగా లేఁడు వారల పలుకు తెఱఁగు.

విసివి డోలాయమాన మానసము తోడ
నేరము విచారణ మొనర్ప నేరననుచు
నేలఁదలవంచు, వగచి కన్నీరునించు
కలఁతఁజెంచు మఱింత వ్యాకులతఁగాంచు!

హృదయమునందుఁ బొంగి ప్రవహించెడి శోకరసంబు లేరులై
సదమల తత్సభాభవన సభ్యుల చిత్తము తేల్చె? జాలిమై
గదసి సహింపలేని తమకంబు వెలారిచి తల్లి అక్కయుం
బదములపైన మోకరిలి బావురటంచని యేడ్వ జొచ్చినన్

అంతటఁ దల్లి యక్కయు భయాతురలై మరుమాట లేక ని
శ్చింతను గ్రాగుచున్ గుఱుతుజిక్కక "యెవ్వఁడు వీఁడటంచునున్"
స్వాంతమునందు తర్కము విచారము జంటగ సందడించి గ
ల్లంతులు వెట్ట సాగిరి కలంతలు పైకొని దొడుఁడీయగన్.

ఆత డెఱింగినంత వఱకత్తఱి నంతయుఁ బూర్వగాఢ దుః
ఖాతతచిత్తమూని వినయాన వచించుచు నుండ దీనతా
మాతయు నక్కయున్ విని గ్రహంబున తిమ్మని గుర్తుపట్టి యా
త్మ్యాతత ప్రేమఁ దోఁగలిసిరందరు పోయినవాఁడు వచ్చెనన్.

ఒకకొంత భారతావని
ప్రకటిత దుర్గతిఁ దలంచి పదవిని విడె, వా
రక వారందరు కులసే
వకు బయనింపఁగ దొడగిరి భాసురమతులై.

సర్వము సంపూర్ణము.

---

# స వ ర ణ

| పుట | | పంక్తి | |
|---|---|---|---|
| 18 | హృదయము | 14 | హృదయము |
| 26 | చేధించు | 14 | ఛేదించు |
| 28 | దీకొల్పి | 7 | ఢీకొల్పి |
| 28 | కెదురు | 16 | కుదురు |
| 29 | దానికీ | 4 | దానికే |
| 29 | తల్లి | 5 | తల్లి |
| 39 | గందు | 3 | గండు |
| 30 | ఖడంబు | 3 | ఖండంబు |
| 31 | పశ్చిమవు | 3 | పశ్చిమపు |
| 39 | ఏనియన్ | 6 | ఏనుగున్ |
| 39 | పృపి | 7 | పృథివి |
| 43 | గా | 7 | గాన్ |
| 50 | ఇగురెత్తి | 11 | ఇగురొత్తి |
| 51 | వివరింప | 7 | విరచింప |
| 54 | చేతిలో | 2 | చేతితో |
| 56 | నేకలు | 7 | నేదగులు |
| 59 | లేమిక | 1 | లేముక |
| 60 | కప్పుర | 16 | కప్పుర |
| 63 | మరియింటి | 1 | మునియింటి |
| 63 | ప్రజలకెమెము | 6 | ప్రజలక్షేము |
| 66 | దైవ్య | 5 | దైన్య |
| 68 | రవాంచినన్ | 6 | రహించినన్ |
| 75 | సహవింపు | 17 | సహించింపు |
| 78 | గురయింప | 12 | గురయింప |
| 80 | పొలికన్ | 5 | పోలికల్ |

---